# ఆంధ్రపత్రిక

3|9|91

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 3 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 3-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా


# “కాశ్మీరులో జనవాక్యసేకరణ ‘చాలావరకు’ అక్కర్లేదనే భావం”

## మురికి బస్తీలను తగుల బెట్టాలని శ్రీ నెహ్రూ భావం

### మంచి ఇళ్లు కట్టించడానికి సేవక్ సమాజ్‌కు రు. 1½ లక్ష మంజూరు

### 6/10 అడుగుల గది అద్దె రు. 15 : 60 వేల మంది ఉండవలసిన బస్తీలో 6 లక్షల మంది

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: మురికి బస్తీలన్నిటినీ దగ్ధం చేసి నేలమట్టం చేసెయ్యాలని ప్రధాని శ్రీ నెహ్రూ అన్నారు. మూడులక్షలమంది పేదలు నివసించే ఈ మురికి బస్తీలను ఇవాళ శ్రీ నెహ్రూ పర్యటించి అక్కడ ప్రజల పరిస్థితులకు చింతించారు. పారిశుధ్యపు కార్మికులు పూలదండలు ఒక చేత పుచ్చుకొని పరుగెత్తుకొని వెళ్లి శ్రీ నెహ్రూను సత్కరించారు.

ఈ బస్తీల్లో ఒక ఇళ్ళయజమాని తప్పి కొన్ని గదులు చూపుతూ గర్వంగా అవి ఈ ప్రజలకోసం తాము నిర్మింపచేసినవని శ్రీ నెహ్రూకు చూపారు. శ్రీ నెహ్రూ పరిశీలించి, వాటినన్నిటినీ పునాదుల్లోకి తవ్వి తీసెయ్యాలన్నారు. అసలీ ప్రాంతమంతా ఇళ్లు తీసేసి నేల చదును చేసెయ్యాలన్నారు.

#### ఇక మా రోజులు బాగుపడతాయి

వాలుచోట్ల మురుగునీరు వీధుల్లో కాలవలపైనే పారుతూ ఉంటుంది. సందులు అతిసన్నం. కొన్ని సందుల్లో ఇద్దరు పక్క పక్కగా నడవడానికి కూడా ఎడంలేదు.

భారత్ సేవక్ సమాజ్ ఏర్పాటు చేసిన నెహ్రూ పర్యటనకి అక్కడి ప్రజలు ఇళ్లకు గోడ ముగ్గులు దిద్ది ఇవాళ పండుగ చేసుకున్నట్లు ఆనందించారు. ప్రతిసందులోనూ గొందిలోనూ ప్రజలు ఇరుకుగా మూగి శ్రీ నెహ్రూకి స్వాగతం ఇచ్చారు. ఒక వృద్ధుడు శ్రీ నెహ్రూ వద్దకు వచ్చి “ఢిల్లీలో కల్లా [illegible] దరిద్రులం. మా చీకటి కొంపలు, ఇరుకుగూళ్లు చూడ్డానికి మీ అంతటివారు వచ్చారంటే, మా రోజులు కొంత బాగుపడతాయనుకుంటున్నాం” అన్నారు. బస్తీవాసులలో కొందరు శ్రీ నెహ్రూను పూలదండలతో, గులాబి రేకులతో ముంచెత్తి జయధ్వానాలు చేశారు.

ఈ ప్రాంతాలు జనావాసాలుగా పనికిరానివని ఢిల్లీ పురపాలకాధికారులు ప్రకటించారు.

మనుష్యులు అత్యధికంగా నివసించే పేటల్లో శ్రీ నెహ్రూను ప్రజలు

4 వ పేజీ 6 వ కాలం చూడుడు

### మద్రాసు గవర్నరుకు బహుమతి

#### వినోద వేషంలో

మద్రాసు, ఏప్రిల్ 1: కాశీయాత్రకు పోతున్న ఒక యాత్రికుడు మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ అని ఎవరూ తెలుసుకోలేకపోయారు.

మద్రాసు శాసన సభ్యుల వసతిగృహం ఉత్సవాలలో పై వినోద వేషానికి మద్రాసు గవర్నరుకు ప్రథమబహుమతి లభించింది.

ప్రతిపక్ష నాయకుడు శ్రీ పి. రామమూర్తి సిగరెట్ పాకెట్లు అమ్ముతూ విహారం పెట్టుకున్న ఒక పటనాగరిక పడుచు వేషం వేశారు.

## వాస్తవస్థితి గుర్తించడం కార్యవాదం అని పాక్ ప్రధానికి శ్రీ నెహ్రూ హితవు

### 1947 నవంబరులోనే పాక్ సైన్యం దురాక్రమణ ఆరంభించినట్లు దాఖలా లున్నవని హెచ్చరిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: “కాశ్మీరులో ప్రస్తుతం జన వాక్య సేకరణ అక్కర్లేదని మీరు భావిస్తున్నట్లు, లోక్ సభలో మీరు చేసిన ప్రకటనకు తాత్పర్యంగా తీసుకోవడం సబబేనా” అని విలేఖరులు అడిగిన ప్రశ్నకు ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ “చాలావరకు అంతే” అని సమాధానం చెప్పారు.

జనవాక్యసేకరణసమస్యపై ఎన్నిసార్లు చర్చలు జరిపినా తిరిగి తిరిగి చివరికి ఒకే మొండివాదానికి దిగుతున్నది. కాబట్టి, మారినపరిస్థితుల్ని గమనించి, ఇంక కొత్త పంథాలో చర్చించడం మంచిదని కార్యవాదిగా తమ అభిప్రాయం అని శ్రీ నెహ్రూ అన్నారు.

పాకిస్తాన్ సేనలు కాశ్మీరుపై దురాక్రమణ జరిపినది, 1948 మే నెలలో అని పాక్ ప్రధాని చెప్పినమాట శుద్ధ అబద్ధం అనీ, 1947 నవంబరులోనే వారి దురాక్రమణ జరిగినట్లు తిరుగులేని ఋజువులు ఉన్నాయనీ శ్రీ నెహ్రూ చెప్పారు.

యథార్థాలు అంటూ పాక్ ప్రధాని పాకిస్తాన్ పార్లమెంటులో చెప్పినవి శుద్ధ అబద్ధాలు అని శ్రీ నెహ్రూ అన్నారు.

న్యాయరీత్యా, రాజ్యాంగానుసారం ఈ సమస్యను పరిశీలించాలీ అంటే, పాకిస్తాన్ చేసినది దురాక్రమణే అనీ, కాశ్మీరు భారత దేశంలో చేరినది న్యాయశాసన విహితంఅనీ ఒప్పుకోవలసి వస్తుంది.



### శ్రీ కృష్చేవ్ ప్రకటన సరియైనదే

అలాకాదు వాస్తవికదృష్టితో పరిశీలించాలీ అంటే, ఈ ఎనిమిదేళ్లలో వచ్చిన మార్పులన్నిటినీ లెక్కలోకి తీసుకోవాలి.

“రాజ్యాంగరీత్యానూ, వాస్తవ పరిస్థితుల్లోనూ పరిణామాలు వచ్చాయి. అందువల్లనే కాశ్మీరుపై శ్రీ బుల్గానిన్, శ్రీ కృష్చేవ్ చేసిన ప్రకటన న్యాయశాస్త్రరీత్యా, రాజ్యాంగరీత్యా యథార్థాలనుబట్టికూడా పూర్తిగా సత్యమే అంటాను” అని శ్రీ నెహ్రూ అన్నారు.

వాస్తవిక విషయాలపై అయోమయమైన సమాచారం ప్రచారంలోకి వచ్చినందువల్ల, లోక్ సభలో తమ ఉపన్యాసంలో కాశ్మీరు సమస్యను సమగ్రంగా వివరించడం మంచిదే అయిందని శ్రీ నెహ్రూ అన్నారు.

“అర్థాలు చెప్పడంలో అభిప్రాయ భేదాలుండవచ్చును. కాని ప్రధానమైన వాస్తవవిషయాలు [illegible] చెప్పడానికి ఇప్పుడూ సిద్ధమే. పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ మహమ్మదాలీ వాస్తవ విషయాలని చెప్పిన విషయాలు అన్నీ శుద్ధ అబద్ధాలు” అని శ్రీ నెహ్రూ అన్నారు.

ఇదంతా పదేపదే ఇదివరకే చెప్పడం అయింది.

ఇందులో మొదటి విషయం భారత దేశంలో కాశ్మీరు చేరిక. ఈ చేరడం న్యాయశాస్త్రరీత్యా, రాజ్యాంగరీత్యా జరిగిందా అనే సందేహానికిచోటు లేదు. ఇదిమోసం అని మహమ్మదాలీ పదేపదే చెప్పడం అది వారికి కాని, పాకిస్తానులో మరొకరికి కాని గౌరవసూచకం కాదు.

రెండో విషయం: కాశ్మీరుపై దాడి చేసి దురాక్రమణ జరిపిన వారికి పాకిస్తాను ఆయుధాలు, పెట్రోలు, లారీలు ఇతర ప్రయాణ సౌకర్యాలు ఇచ్చి సహాయపడిందనేది నిష్పన్నం చేశాం. అవిధంగా చేసినవారే కిందటి ఏడాది రెండేళ్లలో అవిధంగా ప్రకటించుకున్నారు. ఇవన్నీ తెలిసిన విషయాలే.

ఇప్పుడు శ్రీ మహమ్మదాలీ పాకిస్తాన్ సైన్యం 1948 మేలో కాశ్మీరు ప్రవేశించినట్లు చెప్తున్నారు. పాకిస్తాన్ కాశ్మీరులో భారత సైన్యం వల్ల ముప్పు వచ్చినప్పుడే ప్రవేశించారట.

కాని పాకిస్తాన్ సైన్యం 1947 నవంబరులోనే కాశ్మీరులో ఉందని—“ఏ తేదీనో సరిగ్గా చెప్పలేను”—అతుకులు తిరుగులేని దాఖలాలు చూపగలం.

#### పాక్ మూకలు పారిపోయారు

వరాముల్ల రెండు వైపుల భారత సైన్యం తరిమినప్పుడు దాడిమూకలు తట్టుకోలేక పారిపోయారు. బారాముల్లా వరకూ తరిమివేసి మన సైన్యం ఊరీవద్దకు చేరేసరికి అక్కడ పాకిస్తాన్ సైన్యం సిద్ధంగా కూచుని ఉంది.

1948లో ఢిల్లీలో ఒక ప్రదర్శనంలో అప్పుడక్కడ పట్టుకున్న పాకిస్తాన్ ఆయుధాలు, పత్రాలు మొదలైనవి ప్రదర్శించారు. దీనిపైకూడా ఐక్యరాజ్య సమితిలో దీర్ఘ వాదాలు జరిగాయి. కాని ప్రజలిప్పుడా విషయాలన్నీ మరిచిపోయారు.

6 వ పేజీ 6 వ కాలం చూడుడు

## బుడమేరు రిజర్వాయర్ విరమణకు రాజకీయప్రాంతీయకులతత్వాలమూలం

### రైతులేదో చెప్పారని సాకుగా తీసుకోవడం కంటే నష్టాలలెక్కలు చూసుకొమ్మని శ్రీ కాకాని హితవు

కర్నూలు, ఏప్రిల్ 2: “రాజకీయ ప్రాంతీయ కుల తత్వాల మూలంగా బుడమేరు రిజర్వాయర్ పథకాన్ని విరమిస్తున్నామని పబ్లిక్ వర్క్సుమంత్రి శాసనసభలో చెప్పాలి. అంతేగాని సాంకేతిక కారణాలవల్ల ఆ పథకాన్ని విరమిస్తున్నాం అని చెప్పడం హాస్యాస్పదం. అభివృద్ధి పన్ను పడుతుందనే భయంతో మా భూములు మునగడం లేదంటే మా భూములు మునగడం లేదని రైతులు చెప్పుకున్నారని మంత్రి అనడం నాటకమే గాని మరేమీ కాదు. మురుగు వెల్లువను నిరోధించే నిర్మాణాలు చేయించినచోటకూడా అభివృద్ధిపన్ను వసూలు చేసే అధికారం నాలుగైదు నెలల క్రిందట శాసన సభ ఆమోదించిన చట్టం ప్రకారం ప్రభుత్వానికి ఉన్నది.” అని శ్రీ కాకాని వెంకటరత్నం ఒక ప్రకటన చేస్తున్నారు.

బుడమేరు రిజర్వాయర్ పథకం విషయమై పబ్లిక్ వర్క్సు మంత్రి ఇటీవల చేసిన ప్రకటనకు సమాధానం శ్రీ కాకాని వెంకటరత్నం చేసిన ఈ ప్రకటనలో ఇట్లా ఉన్నది. “రాజకీయ వేత్తగా మాత్రమే ఉపముఖ్యమంత్రిని ప్రజలు ఎరుగుదురుగాని ఆయనకు ఇంత సాంకేతిక విద్యా పాండిత్యం ఉన్నదని ప్రజలకు తెలియదు. బుడమేరు వరదల వల్ల లక్ష ఎకరాల్లో పంటలు సర్వనాశనమవుతున్నవని, రిజర్వాయర్ ప్రాజెక్టు నిర్మాణంవల్ల ఆ ప్రమాదం తగ్గుతుందని ఆశించుతున్న ప్రజలకు పబ్లిక్ వర్క్సు మంత్రి ప్రకటన అశనిపాతంగా వచ్చిపడింది.”

“రిజర్వాయర్‌ను నిర్మించి, మళ్లింపు కాలవ త్రవ్వించి, కరకట్టలను బలం చేయాలని సూచించినవారు ఇంజనీర్లు గాని రాజకీయ వేత్తలు కారు. ప్రజలకు లాభించే పథకాలను రాజకీయ కక్షలవల్ల విరమించి ప్రజలకు నష్టం కలిగించ ప్రయత్నించడం అన్యాయం.”

“అయితే ఈ పథకాలను రూపొం

(6వ పేజీ 6వ కాలం చూడుడు)

### మంచుశాలా శిఖరారోహక బృందం

సామా, ఏప్రిల్ 1: మంచుశాలా శిఖరారోహణకు బయలుదేరిన ఒక జపాన్ బృందం ఇక్కడ ఆగిపోయింది. సామాను మోసుకువస్తున్న కూలీలమధ్య ఒక తగాదా బయలుదేరిందని వీరు నేపాల్ ప్రభుత్వానికి రేడియోవార్తను పంపారు.

నేపాల్ ప్రభుత్వం వీరి సహాయార్థం సైనికులను పంపుతున్నారు.

## సరిహద్దుల రక్షణకు విమానదళవృద్ధి

### జెట్ విమానాల తయారీకి కృషి: వార్షికోత్సవంలో ముఖర్జీ ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: ప్రస్తుత వైమానికబలం దేశ రక్షణావసరాలకు చాలనందువల్ల, వృద్ధిపరచవలసివస్తున్నదని భారత వైమానికదళాధిపతి ఎర్ మార్షల్ శ్రీ ఎస్. ముఖర్జీ 28 వ వైమానికదళ వార్షికోత్సవం సందర్భంలో ఆకాశవాణిలో ప్రసంగిస్తూ చెప్పారు.

ఇటీవల కొన్ని పరిణామాల మూలంగా దేశం ఎదుర్కోవలసిన సమస్యల దృష్ట్యా, దేశం సరిహద్దులను కాపాడుకోవలసిన అవసరం కలుగుతున్నదని భారత వైమానిక దళాధిపతి ఎర్ మార్షల్ శ్రీ యస్. ముఖర్జీ అన్నారు.

భారత వైమానిక దళాన్ని వృద్ధిపరచడంలో బలసంఖ్యకంటె, నాణ్యం ఎక్కువగా పరిగణిస్తారని శ్రీ ముఖర్జీ అన్నారు.

గంతేళ్ళలో ఆధునిక పరికరాలను కూర్చిన తరవాత, కార్యనిర్వహణకు తగిన సమర్థత లభించిందన్నారు. ఇప్పటికి ఫైటర్ దళానికి జెట్ విమానాలు వచ్చాయి. ఇంక బాంబర్ దళాలకు కూడా అత్యాధునిక పరికరాలు కూర్చడానికి నిర్ణయించారు.

శిక్షణ విషయంలో విమానదళం అవసరమైన ఏర్పాట్లన్నీ పూర్తిగా మన దేశంలోనే చేసింది. కొన్ని పొరుగు దేశాల వైమానికులకు కూడా మన దేశంలో శిక్షణ ఇస్తున్నారు. మన శిక్షకులను కొందరిని పొరుగుదేశాలకు పంపుతున్నారు. అయితే మన వైమానికుల్ని ఇతర దేశాలకు శిక్షణకోసం పంపడం మానలేదు. ఆధునిక పరిణామాలను అర్థంచేసుకోడానికి ఇది ఇంకా అవసరం.

విమానదళం ఈశాన్య సరిహద్దు ప్రాంతానికి అవసర వస్తువులను చేరవెయ్యడానికి వరదల్లో ప్రజలరక్షణకు, వారికి ఆహారాదికాలు చేరవెయ్యడానికి సహాయపడింది.

జెట్ విమాన యంత్రాలను భారత దేశంలోనే నిర్మించడానికి, వానితో జెట్ ఫైటర్ విమానాలు తయారుచెయ్యడానికి ఒకరికి లైసెన్సు ఇచ్చే విషయంపై రాయబారాలు జరుగుతున్నాయి. విమానాల నిర్మాణానికి అవసరమైన ఇతర వస్తువుల ఉత్పత్తికి ప్రభుత్వం ప్రోత్సాహం ఇస్తుంది.

బెంగుళూరు విమాన కర్మాగారంలో తయారైన హెచ్. టి. 2 శిక్షణ విమానాన్ని శిక్షణకు ఉపయోగిస్తున్నారు. వాంపైర్ జెట్ విమానాలకు ముడిసరుకు భారత దేశంలోనే లభ్యమౌతోంది. అయితే ముఖ్య యంత్రాలను, పరికరాలను ఈ రెండు రకాలకీ కూడా విదేశాల నించే దిగుమతి చేసుకుంటున్నారని శ్రీ ముఖర్జీ చెప్పారు.

### రాష్ట్రపతి శుభసందేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: భారత వైమానిక దళం సంప్రదాయ సిద్ధమైన త్యాగ సేవానిరతినీ, ధైర్య సాహసాలనూ, దేశభక్తినీ ఎల్లప్పుడూ పాటిస్తూనే ఉండాలంటూ, 28 వ వార్షికోత్సవం సందర్భంలో రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ శుభ సందేశం పంపారు. ప్రజలను కష్టాలలో ఆదుకున్న విమాన దళాన్ని రాష్ట్రపతి ప్రశంసించారు.

## కాంబోడియా తటస్థ విధానం ఫలితం

### పశ్చిమరాజ్యాభిమానులవల్ల చిక్కులు: నరోదం హెచ్చరిక

ఫ్నాంపెన్, ఏప్రిల్ 1: తటస్థ విధానాన్ని అనుసరిస్తున్న కాంబోడియాకు ఇరుగు పొరుగుల్లో ఉన్న పశ్చిమరాజ్యానుచరులు చిక్కులు కలిగిస్తున్నందుకు ఇటీవలే ప్రధాని పదవికి రాజీనామా ఇచ్చిన నరోదం సిహనూక్ చేదు తీవ్రంగా విమర్శించారు. ఈ పశ్చిమ రాజ్యానుచరులు కలిగిస్తున్న చిక్కులు 3 వారాల్లో పరిష్కారం కాకపోతే కాంబోడియా సైనిక సహాయం తీసుకోవలసివస్తుందని ఆయన గట్టి హెచ్చరిక చేశారు.

నిరంది అనేచోట ఒక పాఠశాల ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తూ నరోదం ఈ హెచ్చరిక చేశారు.

“కాంబోడియా ప్రజాపరిషత్ 3 వారాల్లో సమావేశం కాబోతున్నది. మనం తటస్థ విధానాన్ని అనుసరించడం సాధ్యమో కాదో ఆపరిషత్ నిర్ణయిస్తుంది. అంతే కాకుండా అమెరికా, థాయ్ లాండ్, వియత్నాంల పట్ల కాంబోడియా అనుసరించవలసిన వైఖరిని కూడా నిర్ణయిస్తుంది. ఈ దేశాలు ఇంకా ఆర్థిక దిగ్బంధాన్ని సాగిస్తూ ఉంటే, తాను చేస్తున్న సహాయాన్ని అమెరికా మానుకోదలిస్తే, అప్పుడు అనుసరించవలసిన విధానాన్ని కూడా ప్రజాపరిషత్ నిర్ణయిస్తుంది.

మన విదేశాంగ విధానం మారాలని పరిషత్ నిర్ణయిస్తుందను కోను. కాని మార్పులన్నీ నిర్ణయమే జరిగితే, ఆ మార్పు కమ్యూనిస్టు దేశాలపై ప్రభావం చూపుతుందని మాత్రం చెప్పవచ్చు.

కాంబోడియా ప్రజాపరిషత్ సమావేశం అయ్యేలోపల 3 వారాల్లోపల పశ్చిమ రాజ్యాభిమాన దేశాలవల్ల మాకు కలుగుతున్న చిక్కులు తొలగిపోనట్లయితే, ఉభయపక్షాలకూ మధ్యగా ఉండేందుకు బదులు సైనా రష్యాల పక్షం కాంబోడియా మొగ్గవచ్చును. ఇటువంటి సందర్భాల్లో ప్రజల వైఖరి తీవ్రంగా ఉంటుంది” అని ఆయన హెచ్చరిక చేశారు.

## ఉద్యోగులకు ఇళ్లు కట్టించడానికి అప్పులు

### స్థానిక సంస్థలకు ప్రభుత్వపు కేటాయింపులు

కర్నూలు, ఏప్రిల్ 1: తక్కువ జీతాలు వచ్చే ఉద్యోగులకు గృహనిర్మాణ పథకంక్రింద పంచాయతీ సంఘాలకు, పురపాలక సంఘాలకు, జిల్లాబోర్డులకు అప్పుగా ఇచ్చేందుకు ఆంధ్రప్రభుత్వం రు. 19 లక్షల 6 వేల 8 వందలు కేటాయించారు. సహకార సంఘాలు, గృహనిర్మాణ సంఘాలకు అప్పుగా యిచ్చేందుకు మరో రు. 15 లక్షలు కూడా ప్రభుత్వం కేటాయించారు.

తక్కువ జీతాల ఉద్యోగుల గృహనిర్మాణ పథకం ప్రకారం ఇళ్ళు కట్టించుకొనేందుకు స్థానిక సంస్థలకు, సహకార సంఘాల ద్వారా వ్యక్తులకు అప్పులు ఇస్తారు. ఈ పథకం ప్రకారం స్థానిక సంస్థలకు రు. 33 లక్షల 75 వేలు, సహకారసంఘాలకు రు. 50 లక్షల 25 వేలు అప్పుగా ఇచ్చేందుకు ఈ రాష్ట్రానికి భారత ప్రభుత్వం కేటాయించారు.

1956 మార్చి 31 వ తేదీలోగా తమ కాళ్ల అన్వర్థ్యవ ఇంటులో దాదాపు రు. 15 లక్షలు ఖర్చవుతుందని సహకారసంఘాల రిజిస్ట్రార్ అన్నారు. ఈ పథకం ప్రకారం స్థానిక సంస్థలకు రు. 19 లక్షల 6 వేల 8 వందలు పంపిణీ చేస్తారని అంచనా.

మార్చి 31 వ తేదీలోగా ఈ పథకం ప్రకారం మొత్తం రు. 84 లక్షల 6 వేల 8 వందలు పంపిణీ కావాలి. ఇప్పటికే యీ పథకం క్రింద రు. 10 లక్షలు ఆంధ్ర ప్రభుత్వానికి భారతప్రభుత్వం ఇచ్చారు. మిగతా రు. 24 లక్షలు త్వరగా మంజూరు చేయమని భారత ప్రభుత్వాన్ని రాష్ట్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించనున్నారు.

## పోర్చుగీస్ పాకిస్తాన్! గోవాపై కరాచీ ఆశ

ఢిల్లీ, ఏప్రిల్ 2: భారతదేశంలో పోర్చుగీసులు పాలిస్తున్న ప్రాంతాలను పాకిస్తాన్‌లో వాడుతున్న ప్రపంచ రాజకీయ పటాల్లో “పోర్చుగీస్ పాకిస్తాన్”\గా చూపిస్తున్నారు.

ఇలా 1953 నుంచీ జరుగుతున్నది. రేవుల్లో విమానాశ్రయాల్లో కస్టమ్స్ అధికారులకు బర్మా, సింహళం, భారత దేశాలలోని పోర్చుగీసు ప్రాంతాలనుంచి వచ్చేపోయే సరుకులను “పోర్చుగీస్ పాకిస్తాన్” శీర్షిక క్రింద నమోదు చేయాలని ఉత్తర్వులు చేశారు.

ఈ సంగతిని వెల్లడిస్తూ పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో శ్రీ నెహ్రూ ఇలా అన్నారు: ఈ పోర్చుగీస్ పాకిస్తాన్ చాలా విచిత్రంగా ఉంది. ఇది ఈ భూగోళంపైకనీ వినీ ఎరగని ముచ్చట. దీని మూలంగా, పాకిస్తానీలు ఎలా ఆలోచిస్తూ ఉంటారో విదితమవుతుంది. పోర్చుగీసులు వెళ్లిపోతే గోవా తమదేనని వాదించడానికి ఇదొక ఎత్తు!”

## అణ్వస్త్రాలను నిషేధించండి లేదా పరిమితపరచమని పోప్ విజ్ఞప్తి

వాటికన్, ఏప్రిల్ 1: అణ్వస్త్రాలను నిషేధించటమో లేక పరిమితి పరచటమో చేసి, మానవ జాతిని నరకకూపంలోకి దిగలాగుతున్న అణ్వస్త్ర పోటీని విరమించుకోవలసిందిగా కాథలిక్ జగద్గురువు పోప్ పేసు ప్రపంచ దేశాలకు విజ్ఞప్తి చేశారు. ఈస్టర్ సందేశంలో ఈయన ఈ సూచన చేశారు.

రేడియోలో ఈస్టర్ సందేశం ఇస్తూ ఈసహా ప్రమాదజేవి ఆవిధంగా హెచ్చరించారు.

“అణుశక్తిని శాంతియుతావసరాలకు వినియోగించటం వల్ల మానవజాతి అభ్యుదయానికి అపూర్వ అవకాశాలు కలుగుతున్నవి. కాని ఈశక్తిని అన్యథా ఉపయోగించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈ విషాద భూయిష్ఠ మార్గంలో ప్రపంచం నానాటికీ ముందుకు పోతున్నది. లోక నాశనకారీ, ఆత్మహత్యా కారణమూ అయిన ఈ అణ్వస్త్రాల పోటీని ఆపటం వీలవుతుందన్న ఆశకూడా ఇంచుమించుగా నశించింది.

మానవజాతి సాధించే అపూర్వ కార్యాల్లో కొన్ని మానవజాతికే ఏ విధంగా ప్రమాదకరం కాగలవో మనంచూస్తూనే ఉన్నాము. నీటిలో అణుశక్తి అగ్రస్థానం వహిస్తున్నది. ఇది ఎన్నో ఆశలనూ, భయాలను కలిగిస్తున్నది.

అణ్వస్త్రాల పోటీనుంచి మానవులు విరమించుకోగలందులకు గాను వివిధ దేశాల నాయకులకు కావలసిన జ్ఞానాన్నీ, శక్తినీ ఏసుక్రీస్తు ప్రసాదించాలని మనమంతా ఏకకంఠంతో ప్రార్థిస్తున్నాము.”

పోప్ అణ్వస్త్రాల నిషేధాన్ని కోరటం ఇదినాలుగోసారి. ఇంతకు ముందు రెండుసార్లు ఈస్టర్ సందేశాల్లోనూ, ఒకసారి క్రిస్మస్ సందేశంలోనూ ఈయన ఈ విజ్ఞప్తిచేసి ఉన్నారు.

క్రైస్తవులు క్రైస్తవ శత్రువులను (అంటే కమ్యూనిస్టులని రాయిటర్ విలేఖరి వ్యాఖ్య) గమనించి జాగ్రత్త పడాలని పోప్ హెచ్చరిక చేశారు. పొరపాటువల్లనో, దౌర్బల్యాలకు లొంగిపోయో, భక్తి విశ్వాసాలను వినాశ పెట్టే వ్యవస్థలతో క్రైస్తవులు సహకరించటం పనికిరాదని ఆయన గర్జించారు.

# యుగోస్లావ్ భారతవ్యాపారం

## ఢిల్లీలో ఒప్పందం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: కొత్తనౌకలు నిర్మించడంలో, భారతదేశం ఇచ్చే ఆర్డర్లకు ప్రథమస్థానమిచ్చి, త్వరగా సరఫరా చేయవలసిందిగా యుగోస్లావియాలోని నౌకానిర్మాణ కేంద్రాలకు తమ ప్రభుత్వం వచ్చ చెబుతుందని యుగోస్లావియా ఆర్థిక ప్రతినిధి వర్గ నాయకుడు శ్రీ మార్జీనివిటెనిచ్ ఇవాళ విలేఖరుల గోష్ఠిలో చెప్పారు.

1956 వ సంవత్సరానికి తాము చేసుకున్న ప్రణాళిక క్రింద, కాఫీ, తేయాకు పరిమళ ద్రవ్యాలు, కొన్ని రకాల వస్త్రాలు, నూనెవిత్తులు, ఉన్ని, ముడి ప్రత్తి, జనుపనారతో తయారుచేసే సరుకులు మొదలైన నిత్యావసర వస్తువులను యుగోస్లావియా దిగుమతి చేసుకోవదలచిందని, నరుకులలోను, నాణ్యంలోను ఇతర దేశాలకుతీసిపోనిపద్ధతిలో భారతదేశం సరుకు ఇవ్వదలిస్తే, తమ దేశం తప్పకుండా దిగుమతి చేసుకోగలదని శ్రీ సెటెనిచ్ చెప్పారు.

భారత యుగోస్లావియాలు నిన్న నే వాణిజ్య ఒప్పందం వ్రాసుకున్నాయి. దీనిద్వారా, వాణిజ్య, సాంకేతిక, ఆర్థికాది రంగాలలో ఇరుదేశాల సంబంధాలూ మరింత పెంపొందగలవని ఆయన అన్నారు. రాజకీయ రంగంలో, వివిధ అంతర్జాతీయసమస్య.పట్ల,శాంతిసాధన, సహజీవన విధానాలపట్ల ఇరుదేశాలకూ ఏకాభిప్రాయం ఉన్నదని, వాటి వల్ల, ఇతర రంగాలలో కూడా సత్సంబంధాలు నెలకొని వర్ధిల్లడానికి దోహదం జరుగుతుందని ఆయన అన్నారు.

### ఆరు రెట్లు

భారత యుగోస్లావియా మధ్య వాణిజ్యం 1955 లో పదిలక్షల డాలర్ల వరకూ జరిగింది. ఈఏడాది కొత్త ఒప్పందం దృష్ట్యా అంచనా వేస్తే, వ్యాపారం ఆరురెట్లు పెరగవచ్చునని విస్తున్నదని శ్రీ సెట్‌నిచ్ అన్నారు.

ఒక్క ఈ దేశంతోనే కాక, మొత్తం మీద ఆసియా దేశాలతో వాణిజ్యం ఇటీవలగా బాగా పెరుగుతూ వచ్చిందని ఈ సందర్భంలో ఆయన తెలియచేశారు.

### దీర్ఘకాలిక ఒప్పందం

మేలురకం బొగ్గు, ముడి ఇనుము, ఉక్కు, సిమెంటుల సరఫరాపై భారత యుగోస్లావియాలు దీర్ఘకాలిక ఒప్పందం వ్రాసుకుంటే బాగుంటుం శ్రీ సెట్‌నిచ్ సూచించారు. తమ దేశం సాలీనా రెండు వేల టన్నుల ఉక్కు, ఉక్కు ఉత్పత్తులు,లక్ష టన్నుల సిమెంటు సరఫరా చేయగలదని అలాగే భారత దేశం తమకు లక్ష టన్నుల ముడి ఇనుము సరఫరా చేయాలని తాము అభిలషిస్తున్నారనీ ఆయన చెప్పారు. ఇక, బొగ్గు ఎంత తీసుకోవడం అనేది భారత దేశం ఇవ్వచూపే బొగ్గురకంపై ఆధారపడి ఉంటుందన్నారు. ఈ రూపేణా ఇరుదేశాల మధ్య వాణిజ్య సంబంధాలు వృద్ధికావడం అవసరమనికూడా శ్రీ సెటెనిచ్ చెప్పారు.





# ఆకాశాన్ని అంటుతున్న ధాన్యం ధరలు

## వరంగల్లు ప్రజలకటకట: చౌకదుకాణాల ఆవశ్యకత

## ధరలు పడకుండా శ్రద్ధ వహిస్తే వాటిని పెంచివేసిన వర్తకులు

(స్వకీయ విలేఖరి)

వరంగల్లు, మార్చి 21: కొద్దికాలం నుంచీ వరంగల్లులో ఆహారాది ధాన్యాల ధరలూ, వాణిజ్యపు పంటల ధరలూ ఆకాశాన్ని అంటడం ప్రారంభించాయి. ఇందువల్ల ప్రజల్లో - ముఖ్యంగా మధ్య తరగతి ప్రజల్లో - ఆందోళన నిస్పృహా తీవ్రంగా బయలుదేరింది. ఆహార ధాన్యాలు చౌకగా అమ్మే దుకాణాలను ప్రభుత్వమే నెలకొల్పాలనే కోర్కె ప్రతిచోటా వెల్లడిస్తున్నారు.

దాదాపు 1,40,000 జనాభా కలిగిన వరంగల్లులో 60,000 పైగా మధ్య తరగతి ప్రజవుంది. వీరి ఆదాయం సరాసరి నెలకు రు 70 కు మించదు. ప్రభుత్వోద్యోగులు వర్తక గుమాస్తాలు, చిల్లర వర్తకులు, క్రయ విక్రయాలను తమ చెప్పుచేతల్లో ఉంచుకోగలిగే వ్యాపారుల దయాధర్మ బిచ్చాలపై ఆధారపడ వలసివస్తున్నది.

### క్రిందటి ఏడు-ఈ ఏడు

క్రిందటి సంవత్సరం ధరలు పడిపోయినప్పుడు నెపంలో దుకాణాలుమూసి వేసినందున పనిలేకుండా పోయినవారు పోగా, ఉన్న దుకాణములలోని గుమాస్తాల జీతాలు ప్రతినెల రు 20 తగ్గించారు. కాని ఈ సంవత్సరం క్రమక్రమంగా ధరలు పెరిగిపోతున్నా జీతాలు హెచ్చించలేదు.

ధరలు తగ్గిఉన్న సమయంలో వేల కొలది పల్లాల ధాన్యాన్ని, నూనెగింజలను నిలవచేసి ధరలు పెరుగుతూవున్న ఈ సమయంలో ప్రతి పల్లానై కనీసం రు 10 లవా లాభం పొందుతున్నారు గుమాస్తాలు మాత్రం యధాతధంగానే ఉండిపోయారు.

నగరంలో ఉన్న జనాభాకు రోజు వారీ కావలసిన బియ్యం కనీసం 1000 పల్లాలు. మొత్తంగా నిలవచేసి మరపట్టించేవారు ప్రస్తుతం ఉన్న బజారు ధర ప్రకారం చిల్లర వర్తకులకు అమ్మకం, వారు తమ లాభాన్ని కలుపుకొని కొనగోలు దారులకు-వాడకం దారులకు- అమ్మకం చేయడం జరుగుతున్నది. అంతంలో ఇందరి లాభాలతో సహా ఎక్కువధరకు కొనుక్కోవలసిన మధ్యతరగతి వారికి ఎంతో ఎక్కువధరలు చెల్లించవలసి వస్తున్నది.

### శ్రీ కృష్ణప్ప సంఘానికి తెలిపినవి

ధరలు పెరగటానికి వేర్వేరు రకాలు తెలుపుతున్నారు: (1) క్రిందటి సంవత్సరం ధరలు పడిపోయి రైతుకు ఉత్పత్తి వ్యయంకూడా పూడటంలేదని బయలుదేరిన ఆందోళన ఫలితంగా ధరలకు ఒక స్థాయి కల్పించటానికి కేంద్ర ప్రభుత్వం శ్రీ క్రిష్ణప్ప అధ్యక్షతన ఒక సంఘాన్ని వేసింది. ఆ సంఘంలో సాక్ష్యమిచ్చినవారు, ఎగుమతులకు కావలసిన రైలుడబ్బాల సప్లయి లేనందున సామాన్య వ్యాపారులు మార్కెటులో కొనుగోలుచేసే సరుకులు మార్పిడికాకపోవడం, బ్యాంకులు ఇచ్చే స్వల్ప అప్పులపై వారు ఆధారపడవలసి రావడంవల్ల, మార్కెటులో తగినపోటీ లేక పోవడం జరిగి బాగా ధనికులైన వర్తకులు మార్కెటులో యథేచ్ఛగా ధరలు తగ్గించివేసే అవకాశాన్ని విరివిగా ఉపయోగించుకొని వేలాదిపల్లాలు నిల్వలు పోసినారనీ, కాబట్టి ప్రభుత్వం ఎగుమతులకు కావలసిన రైలుడబ్బాలు సకాలంలో అందచేయడం, బ్యాంకుల అప్పులు ఎక్కువగా సామాన్య వర్తకులకి లభించేట్లు చూడటం మొదలైన అంశాలను వీరు శ్రీకృష్ణప్ప సంఘం దృష్టికి తీసుకొనివచ్చారు.

### నిలవబోతే పెంచుతున్నారు

పర్యవసానంగా ప్రస్తుతానికి ఎగుమతులకోసం 80 వేల రైలు పెట్టెలు విడుదల చేయగలమని ప్రభుత్వం ప్రకటించడం, ఒక కనీస సరఫర ప్రతి వస్తువుకూ నిర్ణయించి అంతకు తగ్గకుండా ప్రభుత్వం చూడగలదనే విశ్వాసం, ఏర్పడింది. ప్రభుత్వం చేయగలదన్న ఈ కట్టుదిట్టాల మూలంగా ధరలతగ్గుదల భయంపోయిన పిమ్మట, ఎక్కువ ధరలను సాధించి నిల్వకోవాలని వర్తకులు తాపత్రయ పడుతున్నారు. (2) దేశంలోని అన్ని ప్రాంతాలకు సప్లయి చేసేందుకు రైలుపెట్టెలు లభిస్తున్నందు వలనా 3. దేశంలో అనేక ప్రాంతాలలో అతివృష్టివల్లనో,అనావృష్టివల్ల పంటలు చెడిపోయినవనీ, ఆ ప్రాంతాలకు ఎగుమతి అవకాశాలున్నాయనే ఆశ చేతనూ. 4. కేంద్రప్రభుత్వం తననిద్దగల ఆహార ధాన్యాల విడుదల చేయడానికీ, కొత్తవి కొనడానికీ నిర్ణయించినట్లు ప్రకటించడం వల్లనూ.

ఈ విధంగా ధరలు పెరిగిపోయినట్లు అభిప్రాయం వెలిబుచ్చుచున్నారు.

### నిలవలు చేశారు

బెల్లం, మిర్చి, వేరుసెనగ, పప్పుధాన్యాలు, తదితర నూనె గింజలూ బజారుకు వచ్చిందే తడవు, కొని నిల్వలు చేస్తున్నారు. వీరి నిల్వలు వేల పల్లాలలోనే ఉన్నట్లు తెలుస్తున్నది. ఇందువల్ల వర్తకుల్లో క్రిందటి సంవత్సరం కన్నా ఈ సంవత్సరం అత్యంత ఉత్సాహం కనుపించినా ఎగుమతులకై రైలు పెట్టెలు ఇంకా సకాలంలో అందటం లేదనే ఆరోపణ కూడా ఉన్నది.

వీరి వ్యవహారం ఇలా ఉంటే, గుమాస్తా వ్యవహారం మధ్య తరగతుల వారి వ్యవహారంఅగోచరంగా ఉన్నది.

### ధరల వైపరీత్యం

వరంగల్లు ధాన్యపు మార్కెటులో సేకరించిన ఈపట్టికవల్ల క్రిందటి సంవత్సరానికి ఈ సంవత్సరానికి ధరలలో ఎంత మార్పువున్నది చూడవచ్చు.

| | మార్చి 1955 లో | మార్చి 1956 లో |
|---|---|---|
| వేరుశనగ | | |
| పల్లా | 38-12-0 | 60-12-0 |
| ఆముదాలు | 26-0-0 | 55-0-0 |
| నువ్వులు | 54-12-0 | 107-0-0 |
| మిర్చి | 110-0-0 | 210-0-0 |
| పెసల్లు | 28-1-0 | 42-8-0 |
| శనగలు | 22-0-0 | 37-8-0 |
| కందులు | 20-0-0 | 38-0-0 |
| ఉలవలు | 21-12-0 | 26-0-0 |
| మొక్కజొన్న | 16-8-0 | 36-0-0 |
| ఉల్లిగడ్డ | 7-2-0 | 16-0-0 |
| వెల్లిగడ్డ | 22-8-0 | 35-4-0 |
| చింతపండు | 19-5-0 | 42-0-0 |
| పల్లినూనె | మణుగు | 16-10-0 |
| ఆముదం | " | 12-4-0 |
| నెయ్యి | " | 84-0-0 |
| కిచిడీధాన్యం | 24-12-0 | 37-8-0 |
| క్రొత్తిపల్లా | | |
| " పాతవి | 34-12-0 | 46-0-0 |
| దొడ్డుధాన్యం | | |
| కొత్తవి | 22-2-0 | 38-0-0 |
| దొడ్డువి | | |
| పాతవి | 24-12-0 | 34-0-0 |
| గోధుమలు | 41-5-0 | 56-0-0 |
| తెల్లజొన్నలు | 20-10-0 | 42-0-0 |
| పచ్చజొన్నలు | 16-4-0 | 36-0-0 |
| పత్తి (రాబి) | 54-0-0 | 59-0-0 |
| " వానకాలం | | 59-0-0 |
| ధాన్యాలు | 58-12-0 | 80-0-0 |
| వేరుశనగపిండి | | 14-8-0 |
| ఆముదం పిండి | | 16-0-0 |
| లాభ్యాధాన్యం | | 38-12-0 |
| రాజగరీక | | |
| పాతవి | | 32-0-0 |
| " కొత్తవి | | 29-12-0 |
| బంగారంతులం | | 106-0-0 |
| వెండి తులం | | 1-14-0 |

మార్కెటు ధరల వ్యవహారం యీలా ఉంటె నిత్యజీవితానికి అవసరమయిన వస్తువుల ధరలుకూడా పెరుగుతున్నాయి; మొత్తంమీద చౌకధరల ధాన్యపు డిపోలు తెరిచి ప్రభుత్వం ప్రాథమిక దశలోనే చర్యతీసు కొంటారని ఆశిస్తున్నారు. పాతనిల్వలను మార్చటంలో ఆ ధాన్యాన్ని వర్తకులకు అమ్మటంకన్నా చౌకడిపోలు పెట్టడం వల్ల కొనుగోలుదారులకు ఆర్థికంగా మేలు లభించటమే గాక సామాన్య వర్తకులకు వ్యాపార రంగంలో ప్రోత్సాహం లభిస్తుంది. కేంద్రప్రభుత్వ గిడ్డంగులలో ఉన్న నగరంలోని 13 గోదాముల్లో 35,000 టన్నుల బియ్యం నిలవ ఉన్నట్లు తెలుస్తున్నది.

# పంటలకు రవాణా సౌకర్యాలు

## వ్యవసాయమంత్రి హామీ

గుంటూరు, మార్చి 31: "తమలపాకులవంటి త్వరగా చెడిపోయే పంటలకు రైతులు సత్వరంగా రవాణా చేయించడానికి అవసరమైన సౌకర్యాలను ప్రభుత్వం ఏర్పాటు చేయవచ్చు రాష్ట్రంనుంచి ఇతర ప్రాంతాలకు 10 వేల టన్నుల మిరపకాయలను ఎగుమతి చేయడానికి అవసరమైన సౌకర్యాలు కూడా ప్రభుత్వంచేయిస్తుందని ఆశించవచ్చు" అని నిన్న సాయంకాలం ఇక్కడ జరిగిన సభలో వ్యవసాయ శాఖమంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డి అన్నారు.

వ్యవసాయశాఖ మంత్రిని సన్మానించేందుకు ఏర్పాటైన ఈ సభకు శ్రీ ప్రగడ కోటయ్య అధ్యక్షత వహించి శ్రీ ఓబులరెడ్డి ప్రజా సేవాసక్తి ప్రశంసించారు.

జిల్లా కిసాన్ సమ్మేళనం తరఫున శ్రీ కల్లూరి వీరయ్య, ఆంధ్ర యువ విజ్ఞానసమితి తరఫున శ్రీ దరువూరి వీరయ్య, జిల్లా విద్యార్థికాంగ్రెసు తరఫున శ్రీ ఎన్. ఇన్నయ్య వ్యవసాయ శాఖ మంత్రికి సన్మానపత్రాలు సమర్పించారు. శ్రీయుతులు ఎన్ వీరాచారి, కరణం రామస్వామి చౌదరి గారలు ప్రసంగించారు.

ఆంధ్రదేశానికి కోస్తా చాలా ఉన్నప్పటికి పెద్ద ఓడరేవు ఏర్పడనందుకు వ్యవసాయశాఖ మంత్రి తన ప్రసంగంలో విచారం వెల్లడించి చీరాల రేవును మద్రాసు ఓడరేవంత పెద్దదిగా తయారు చేసుకోవచ్చు నన్నారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో జరిగే అభివృద్ధి పనులను వివరించి ఇట్లా అన్నారు "మనకు రకరకాల పంటలున్నవి. ఎగుమతిసౌకర్యాలు లేవు. తమలపాకులవంటి త్వరగా చెడిపోయే పంటలకు ప్రభుత్వం సత్వర రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేయిస్తుందని ఆశించవచ్చు. అట్లాగే 10 వేలటన్నుల మిరపకాయలను ఎగుమతి చేయడానికి కావలసిన ఏర్పాట్లుకూడా ప్రభుత్వం చేయిస్తారని ఆశించవచ్చు."

"మన్నెప్రపరిశ్రమను బాగా అభివృద్ధిచేసి ఇతర ప్రాంతాలకుకూడా చేపలను ఎగుమతి చేయించాలి" అటు తరువాత ఆ ఉపుల సమీపంలోని రైతులు ఎదుర్కొంటున్న సమస్యలను తదితర సమస్యలను ప్రస్తావించి వాటి పరిష్కారానికి శాయశక్తులా కృషి చేస్తానని మంత్రి అన్నారు. శ్రీ దరువూరివీరయ్య వందన సమర్పణచేశారు.

# అల్జీరియాకు ఫ్రెంచి ఈస్టర్

## అదనపు సేనలు

అల్జీర్సు, ఏప్రిల్ 1: ఈస్టర్ పండగ సందర్భంలో అల్జీరియా జాతీయవాదులు దాడులు ఎక్కువ చేస్తారన్న భయంతో 2 వేలమంది ఫ్రెంచి సైనికులు అదనంగా జేసెక్కడకు రప్పించబడ్డారు. ఒకటి రెండు రోజుల్లో మరి 2 వేలమంది రాగలరని తెలుస్తున్నది. క్రిందటి వారం 8 వేలమంది పశ్చిమాఫ్రికా నుంచి రప్పించబడ్డారు.

బూన్ అనే చోట మొన్న, నిన్న ఫ్రెంచి పెరాచూట్ దళాలు హెలీకాప్టర్లతో జాతీయవాదులతో పోరాడారు. కానస్టంటీనకి తూర్పుగా పెరాచూట్ దళాలు పోరాటం సాగిస్తున్నవి. 600 మంది పశ్చిమాఫ్రికా సైనికులను తీసుకుని వస్తున్న రైలును జాతీయాలు పడగొట్టారు.

ట్యునీషియాలో కూడా ఫ్రెంచి సైన్యాలు విమానాల తోడ్పాటుతో జెబెల్ కబరీత్ అనే చోట భారీ ఎత్తున పోరాటాలు సాగిస్తున్నవి.

# పశ్చిమ పాక్ ముఖ్యమంత్రి పదవి

## లీగ్ అధ్యక్షుని కినుక

లాహోరు, ఏప్రిల్ 1: పశ్చిమ పాకిస్తాన్ ముఖ్య మంత్రిగా డా॥ ఖాన్‌సాహెబ్ నే ఉంచుటకు పాకిస్తాన్ ముస్లింలీగ్ నాయకత్వం అంగీకరించిందని, ప్రధాన మంత్రి చేసిన ప్రకటనపై, ముస్లింలీగ్ అధ్యక్షుడు అబ్దుర్ రాబ్ నిష్టార్ వ్యాఖ్యానం చేయడానికి నిరాకరించారు.

ఇక్కడ విమానాశ్రయంలో దిగగానే పత్రికా విలేఖరులు ఆయనను చుట్టుముట్టగా "రాష్ట్రంలో మంత్రి వర్గ నిర్మాణం విషయమై మీ యిష్టం వచ్చినన్ని ప్రశ్నలు అడగండి ఒక్కదానికి కూడా సమాధానం యివ్వను" అని ఆయన ఖండితంగా చెప్పాడు.

అయితే, లీగ్ కార్యవర్గాన్ని సంప్రదించే, డా॥ ఖాన్‌సాహెబ్‌ను ముఖ్యమంత్రిగా ఉంచటానికి నిశ్చయించారా అని అడగగా, ప్రధాన మంత్రి తనను సంప్రదించలేదని శ్రీ నిష్టార్ చెప్పారు.

మంత్రివర్గ నిర్మాణానికి సంబంధించి రాజ్యాంగం చట్టంలోని, నిబంధనల అమలు విషయం ప్రస్తావించగా, "ఆ సంగతి రాజ్యాంగం తయారు చేసిన వారిని, మంత్రివర్గాలు ఏర్పాటు చేసే వారిని రద్దుచేసే వారిని అడగండి" అని నిష్టార్ విసురుగా అన్నారు.

తూర్పు బెంగాలులో తన పర్యటన విషయం చెబుతూ, అనుకొన్నదానికన్నా ముందుగానే, తూర్పుబెంగాలు ముస్లింలీగ్‌ను పునరుద్ధరించవచ్చునని ఆయన అన్నారు.

# రాష్ట్రాలబిల్లుపై హైదరాబాద్ శాసనసభ కాంగ్రెసు చర్చ

## ఆంధ్ర హైకోర్టుకు ఇద్దరు న్యాయమూర్తులు- శ్రీ జగన్మోహన్ రెడ్డి, శ్రీ కుమరయ్యా

హైదరాబాద్, ఏప్రిల్ 1: హైదరాబాద్ శాసనసభ కాంగ్రెసు పక్షం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును పరిశీలించారు.

బీదర్ భవిష్యత్తుపై సమావేశంలో దీర్ఘ చర్చ జరిగింది. యీ జిల్లాలోని మరాఠీ, తెలుగు తాలూకాలను ఆయా భాషా రాష్ట్రాలలో కలిపివేసిన తరువాత మిగిలే ప్రాంతాలను బిల్లులో సూచించినట్టు గుల్బర్గా జిల్లాలో కలిపివేయక ప్రత్యేక జిల్లాగా ఏర్పాటు చేయమని ఆ జిల్లా ప్రతినిధులు విజ్ఞప్తి చేశారు. బీదర్, భాల్కి, హుమ్నాబాద్, సంత్ పూర్ (కన్నడ) తాలూకాలను గుల్బర్గా జిల్లాలోనిచించోలి,ఆల్నాద్ తాలూకాల్లో కలిపి వెయ్యాలని సూచించారు. గుల్బర్గా కాంగ్రెసు సభ్యుల మధ్య ఏకాభిప్రాయం కుదిరే వరకు యీ వ్యవహారాన్ని వాయిదా వేశారు.

ఆంధ్ర - తెలంగాణా అనే రెండు పదాల అర్థం ఒకటే కనుక ఈ రెండు ప్రాంతాలను కలిపి ఏర్పాటు చేసే రాష్ట్రానికి "ఆంధ్ర-తెలంగాణా" అనే పేరు సమంజసంగా లేదని సభ్యులు అభిప్రాయం వెల్లడించినట్టు తెలిసింది. 8 వ తేదీన కర్నూలులో జరిగే యీ ఉభయ ప్రాంతాల నాయకుల సమావేశంలో ఈ సమస్య ఎటూ పరిశీలనకు వస్తుందికనుక నేటి సమావేశంలో దానిపై నిర్ణయమేమీ జరగలేదు.

రాష్ట్ర శాసనసభ కాంగ్రెసు పార్టీ సమావేశంలో పరిశీలనకు వచ్చిన మరొక ముఖ్య విషయం తెలంగాణాలో ఎన్నికలు. 1957 లో తెలంగాణాలో ఎన్నికలు జరగాలనిరాష్ట్ర్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు ఉద్దేశించిఉన్నది. 1960 లో ఆంధ్ర శాసన సభ రద్దుకావలసి ఉన్నది కనుక 1957 లో తెలంగాణాలో ఎన్నికలు జరిగితే ఎన్నికల సభ్యులు 8 ఏం॥ లే అధికారంలో ఉంటారు. ఇప్పటి తెలంగాణా శాసన సభ్యులు అక్టోబరు మొదటి తేదీన ఆంధ్ర శాసనసభతో కలిస్తే మరి శాసనసభ సభ్యులు అధికారంలో ఉన్నంతకాలమూ తెలంగాణా ప్రతినిధులకు మాత్రం సభ్యత్వం ఉండదా అనే విషయంకూడా ప్రస్తావనకు వచ్చింది. ఈ సమస్యను రాజ్యాంగ చట్టాన్ని పరిశీలిస్తున్నారని తెలుస్తున్నది.

బిల్లులోని ఇతర అంశాలను పరిశీలించేందుకు పార్టీ నేటిరాత్రి మళ్ళీ సమావేశమవుతుంది.

బొంబాయినగరాన్ని మహారాష్ట్రంలో చేర్చమని శాసనసభ నిర్ణయించాలని మహారాష్ట్ర ప్రతినిధులు కోరారట. ఈ సమస్యకు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ నివేదికపై జరిగిన సాధారణ చర్చలో అధిక ప్రాముఖ్యమిచ్చారు. కనుక మళ్ళీ అదే విషయాన్ని చెప్పి ప్రయోజనమేమీ ఉండదని ఇతర సభ్యులు అభిప్రాయమిచ్చారు.

సభ్యులు తమ అభిప్రాయాలను సభలో బహిరంగంగా వెల్లడించే స్వేచ్ఛ అవసరమా? సవరణలను ప్రతిపాదించే స్వేచ్ఛ సభ్యులకు ఇవ్వవచ్చా? ఇష్టం వచ్చినట్టు వోటుచేసే హక్కు సభ్యులకు ఇవ్వవచ్చా? అనే సమస్యలను కర్నూలు సభలో చనలను చించి తెలంగాణా నాయకులు తిరిగివచ్చిన తరువాత పరిశీలించుతారు.

కర్నూలులో మంగళవారం జరిగే సమాలోచనలలో పాల్గొనేందుకు ముఖ్యమంత్రి శ్రీ బి. రామకృష్ణరావు, రెవిన్యూ మంత్రి శ్రీ కె. రంగారెడ్డి, వ్యవసాయ శాఖమంత్రి డాక్టరు ఎమ్. చెన్నారెడ్డి, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జె. వి. నరసింగరావుగారలు రేపు రాత్రి ఇక్కడినుంచి బయలుదేరి వెళ్తారు.

కొత్త రాష్ట్రానికి తగిన పేరుపెట్టే విషయం, హైకోర్టును ఎక్కడ ఏర్పాటు చెయ్యాలనే సమస్యలనేకాక ఆంధ్రతెలంగాణా రాష్ట్ర ఏర్పాటుకు సంబంధించిన ఇతర సమస్యలను కూడా కర్నూలు సమావేశంలో పరిశీలిస్తారు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు శాసనసభ పరిశీలనకు రేపు మధ్యాహ్నం ప్రతిపాదిస్తారు.

ఈ బిల్లువల్ల భారతదేశ పటంలో ప్రత్యేక హైదరాబాద్ రాష్ట్రమనేది ఇక ముందు లేకుండా పోతుంది. దక్కన్‌సుబేదార్,నైజాముల్ ముల్క్ ఢిల్లీతో తెగతెంపులు చేసుకొని స్వతంత్రుడుగా హైదరాబాద్ పరిపాలన కొనసాగించి నప్పటి నుంచి హైదరాబాద్ పరిపాలన సొంతము వచ్చిన ఆసఫ్ జాహీ వంశానికి ఇక ఈ రాష్ట్ర పరిపాలనతో సంబంధం లేకుండా పోతుంది.

ఇప్పుడు పరిశీలనకు వచ్చే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుప్రకారం యీ రాష్ట్రంలోని మూడు భాషా ప్రాంతాలు ఇప్పటి ఆంధ్ర, మైసూరు, రాష్ట్రాలలోను కొత్తగా ఏర్పాటు చేయదలచిన మహారాష్ట్రంలోను అక్టోబరు మొదటి తేదీన కలిసిపోతవి.

ముప్ఫయి సంవత్సరాలనాడు ఏర్పాటైన హైదరాబాదు హైకోర్టు రద్దవుతుంది. పరిశీలనలో ఉన్న వ్యవహారాలన్నీ ఆంధ్ర హైకోర్టుకు మారగలవు. పాత జడ్జీలలో కొంతమంది ఇతర రాష్ట్రాలకు బదిలీ అవుతారు. ఇంకా కొంతమంది ఉద్యోగంనుంచి విరమించి విశ్రాంతి తీసుకుంటారు. ప్రధాన న్యాయమూర్తి శ్రీ పల్‌రావ్ పళ్ళిట్కర్ న్యాయమూర్తి శ్రీ విఠల్‌రావ్ గారలు ఉద్యోగాలనుంచి విరమిస్తారు. న్యాయమూర్తులు శ్రీ జగన్మోహనరెడ్డి, శ్రీ కుమరయ్య ఆంధ్ర హైకోర్టుకు వెళ్తారని తెలుస్తున్నది. ఉర్దూభాష తెలిసిన న్యాయమూర్తులు శ్రీ కమర్ హసన్ శ్రీ బిల్‌గ్రామి అలహాబాద్ హైకోర్టుకు వెళ్ళే అవకాశం కనిపిస్తున్నది. మిగతా న్యాయమూర్తులను బొంబాయి, మైసూరు రాష్ట్రాలకు బదిలీ చేస్తారు.

ఇంకొక విషయం. కొత్తరాష్ట్రానికి హైదరాబాదు ప్రధాన నగరమని బిల్లు పేర్కొనలేదు. కాని, ఆవిషయమై ఆంధ్ర- తెలంగాణా నాయకులకు ఒప్పందంకుదిరింది.

హైదరాబాదు శాసనసభ అక్టోబరు మొదటి తేదీనుంచి ప్రత్యేక శాసనసభగా ఉండదు. ఆయా భాషా ప్రాంతాల సభ్యులు ఆయా ప్రాంతాలు కలిసే రాష్ట్ర శాసన సభలసభ్యులుగా చేరిపోతారు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుపై శాసనసభలో రేపుసాధారణ చర్చజరుగుతుంది. ఆతరువాత సమావేశం వాయిదా పడుతుంది. బిల్లు వివరాలను చర్చించేందుకు శాసనసభ మళ్ళీ 10 వ తేదీన సమావేశమవుతుంది.

# రష్యా బర్మాల వాణిజ్య ఒడంబడిక

రంగూన్, ఏప్రిల్ 1: ఇదివరకు చేసుకొన్న మూడేళ్ల ఒడంబడిక అనుబంధంగా, బర్మా, రష్యాలు మరో 8 ఏళ్ల వాణిజ్య ఒడంబడిక చేసుకొన్నవి. ఈ ఒడంబడికపై ఉభయ ప్రభుత్వాల ప్రతినిధులు ఇవాళ సంతకాలుచేశారు.

ఈ ఒడంబడిక ప్రకారం రష్యా సాలీనా 4 లక్షల టన్నుల బర్మాబియ్యం తీసుకొని, అందుకు బదులుగా యంత్ర సామగ్రి, తదితర సాంకేతిక సహాయం అందచేస్తుంది. రష్యా ఉపప్రధాని శ్రీ మికోయాన్ ఇక్కడ మూడు రోజుల పాటు జరిపిన సంప్రదింపుల పర్యవసానమే ఈ ఒడంబడిక. ఈ సంప్రదింపులు సోవియట్ ప్రధానమంత్రి శ్రీ బుల్గానిన్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు శ్రీ కృశ్చేవ్ క్రిందటిసారి బర్మా వచ్చినప్పుడు ప్రారంభమై నేటితో సమాప్తి అయినవి.

# బొంబాయికి నెహ్రూ న్యాయం చేస్తారు

## శ్రీ దేవ్ హితవు

బొంబాయి, ఏప్రిల్ 1: ఢిల్లీలో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూతో సంప్రదింపులు జరిపి, యిక్కడకు రాగానే, శ్రీ శంకరరావు దేవ్ సంయుక్త మహారాష్ట్ర కాంగ్రెస్ పరిషత్ కార్యవర్గ సభ్యులకు బొంబాయినగర సమస్యపై ఆందోళన విరమించవలసిందిగా సలహాయిచ్చారు. అయితే, యీ సలహా వారి చెవికెక్కలేదని, సత్యాగ్రహం సాగించడానికే నిశ్చయించారని తెలుస్తున్నది.

పరిషత్ కార్యవర్గ సభ్యులతో శ్రీ దేవ్ 8 గంటలసేపు మాట్లాడారు. ప్రధానమంత్రితో తను జరిపిన సంప్రదింపుల సారాంశాన్ని వారికి వినిపించి "శ్రీ నెహ్రూ, మహారాష్ట్రులకు న్యాయం కలుగజేస్తారు. నా మాట నమ్మండి" అని విజ్ఞప్తి చేశారు. బొంబాయి నగరంలో పరిస్థితి మళ్ళీ మామూలుకు వస్తే, యీ సమస్య సమరసంగా, శాంతియుతంగా పరిష్కారమవుతుందని ఆయన చెప్పారు.

బొంబాయిలో అల్లర్ల విషయం విచారణ జరిపించమని శ్రీ దేవ్ పట్టుబట్టనందుకు, పరిషత్ నాయకులు ఆశాభంగం వెల్లడించారు.

నగరం భవిష్యత్తు విషయమై ప్రధాన మంత్రి ఖచ్చితమైన ప్రతిపాదన యేమీ చేయనందున, శాంతియుతంగా సాగే ఆందోళన విరమించి ప్రయోజన మేమీ లేదు. అని పరిషత్ నాయకుడు ఒకరు యు. పి. ఐ. విలేఖరితో అన్నారు.

# కాంటర్బరీ చర్చికి మాలెంకోవ్ రాక

కాంటర్బరీ, ఏప్రిల్ 1: సోవియట్ మాజీ ప్రధాని శ్రీ మాలెంకోవ్ నేడీ చారిత్రాత్మక ప్రార్థనాలయాన్ని సందర్శించారు. ఆయనను చూసేందుకు ఆంగ్లికన్ చర్చిలో ప్రార్థనలుచేస్తున్న జనం ప్రార్థనలువదిలిపెట్టిపోయి ఆయన చుట్టూ మూగారు.

కమ్యూనిస్టు మతాచార్యుడని పేరు పొందిన కాంటర్బరీ డీన్ డా॥ హ్యూలెట్ జాన్సన్ శ్రీ మాలెంకోవ్ వెంట వచ్చారు.

జనం ప్రార్థనలు విడిచిపెట్టి పరుగులెత్తటంలో కుర్చీలను నెట్టివేశారు. వాటిమీద నిలబడి ఫోటోలు తీశారు. శ్రీ మాలెంకోవ్ చుట్టూమూగి, సంతకం చేయమంటూ పుస్తకాలను ఎదటపెట్టారు. కొందరు స్త్రీలు ఉత్సాహాతిశయంతో చుట్టూచేరి, భుజాలను తట్టి పలరామర్శించారు.

శ్రీ మాలెంకోవ్ ఇట్లా ఈ కెథెడ్రల్‌లో ప్రవేశించినప్పుడు, ఆర్చిబిషప్ డా॥ జాఫ్రీ ఫిషర్ సాయం ప్రార్థన జరుపుతున్నారు. ఆ తరువాత ఆయన తన భవనానికి వెడుతుండగా డా॥ జాన్సన్ శ్రీ మాలెంకోవ్ బృందంతోసహా ఒక అడుగు దూరంలోకి వచ్చారు. సోవియట్ బృందాన్ని ఆయనకు పరిచయం చేయటానికా అన్నట్లు డా॥ జాన్సన్ తన చేతిని వారి వైపుకు చాచారు.

కాని ఆర్చిబిషప్ మాత్రం ఆగనూ లేదు. వారివంక తిరగనూలేదు. చేతిలో ఉన్న అధికారదండాన్ని కొంచం ఊగించి వెళ్ళిపోయినాడు.

ఇది డా॥ జాన్సన్‌కి బుద్ధిచెప్పటమని కొందరు అన్నారు. డా॥ జాన్సన్ ఆర్చిబిషప్ కలుసుకున్నప్పుడు యీ పే గౌరవం చూపారేకాని, మరి దేనికీ ప్రయత్నించలేదని ఆయనపరివారంలో ఒకరు అన్నారు.

# సోవియట్ కాంగ్రెస్ నిర్ణయాలు

## కమ్యూనిస్టులందరికి ప్రమాణాలని తీర్మానం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: భారత కమ్యూనిస్టు సంఘం అయిదు రోజులు సమావేశమై "20 వ సోవియట్ కమ్యూనిస్టు కాంగ్రెస్ పత్రాలు సిద్ధాంతాల దృష్ట్యా కార్యావసరాల దృష్ట్యాకూడా అత్యంత ప్రధానమైనవి" అని తీర్మానం చేశారు.

20 వ రష్యన్ కమ్యూనిస్టు కాంగ్రెస్ సమావేశమై సోవియట్ ప్రజలకే కాక, సకల దేశాల కార్మిక ప్రజలకీ, అభ్యుదయ మానవాళికీ, కూడా పరమార్థం బోధించేది అని తీర్మానంలో చెప్పారు.

అజేయమైన మార్క్సిస్టు లెనినిస్టు ప్రబోధాలను సృజనాత్మకంగా వృద్ధి పరుస్తూ, ప్రపంచ పరిణామాలను గురించి కొత్త అర్థాలను వివరిస్తూ, సోవియట్ కాంగ్రెస్ సకల రంగాలలోనూ కార్మిక ప్రజల విజయానికి తోడ్పడుతుంది. ధనికవాదంకంటె సామ్యవాదం గొప్పదని చాటుతూ, సామ్రాజ్యవాదం బలహీనమై పోయిందని ఈ కాంగ్రెస్ నిరూపించింది. అనేక దేశాలు సామ్యవాద లక్ష్యం దిక్కుగా పురోగమించడానికి కొత్త పంథాలు చూపింది.

ప్రతి దేశంలోనూ సామ్యవాద సాధనకు అంతర్యుద్ధం, హింస అవసరం కాదనీ, కొన్ని దేశాలలో శాంతిగా సామ్యవాదాన్ని సాధించడానికి వీలైన అవకాశాలున్నాయనీ నిరూపించింది. దీనితో కమ్యూనిస్టులు దౌర్జన్య పరులనే శత్రువుల దుష్ప్రచారం దెబ్బతిన్నది. దీనితో కార్మిక వర్గాల మధ్య ఐకమత్యం బలపడుతుంది.

వ్యక్తి ఆరాధనను విమర్శించి సోవియట్ కాంగ్రెస్ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి మహోపకారం చేసిందని భారత కమ్యూనిస్టు సంఘం తీర్మానంలో చెప్పింది.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గుణ బ॥ అష్టమి 1956- సం॥ ఏప్రిల్ 3 మంగళవారం మం॥అష్టమి రా 2-55 పూషా రా2-29 వర్జ్యం 10-18 ల 12-2 వ.

బ॥ నవమి ఏప్రిల్ 4 బుధవారం బ॥ నవమి రా 5-16 ఉ ఓ రా 5-28 వర్జ్యం 11-23 ల 13-14 వ.

ఆంధ్రపత్రిక

ఒదవ చేయని యొనరించిన వరవర యత్రియము గన మనంబున నగు దా ని రాంభ వనిచేయదునికి వరాయణము వరమధర్మవథము లెల్లన్ (మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గుణ బ॥ అష్టమి మంగళవారం

## బుడమేరు రాజకీయాలు

బుడమేరు వరద మళ్లింపు కాలువకు ఈ నెల 11 వ తేదీన శంకుస్థాపన జరుగుతుందని పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి క్రిందటి శనివారం వెల్లడించారు. బుడమేరు వరదనిరోధక పథకంపై మంత్రివర్గ పునఃపరిశీలన శంకుస్థాపనకు రెండు రోజులు ముందుగా జరుగుతుందని కూడా వారు పత్రికా విలేఖరులకు తెలియజేశారు. బుడమేరు రిజర్వాయరును వరద నిరోధక పథకంనుంచి తప్పించి, కట్టలను ఎత్తుచేసి, మళ్లింపు కాలవను త్రవ్వించడంతో ఈ వరద నిరోధకపథకాన్ని పూర్తి చేయదలచినందుకు బుడమేరు ప్రాంత రైతులు తీవ్ర అసంతృప్తిని వెల్లడించారు. రాష్ట్ర శాసనసభలో ఆ ప్రాంత ప్రతినిధులు పబ్లిక్ వర్క్సు శాఖామాత్యుని వైఖరిని నిశితంగా విమర్శించారు. అందుమీదట 'బుడమేరు వరద నిరోధక పథకంపై పునఃపరిశీలన జరుగుతుంద'ని, ఈ పథకం ఆ ప్రాంతములకు తృప్తికరంగా వుండేటట్లు రూపొందించడానికి శాయశక్తులా కృషి చేయగలమని ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి హామీ ఇచ్చారు. పునర్విచారణకు అవకాశం వున్నదని పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి కూడా చెప్పారు. కాని ఈపునఃపరిశీలన పునర్విచారణ ఫలితంగా పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి నిర్ణయం మారే అవకాశం లేదని వారు శనివారం పత్రికా విలేఖరులకు తెలిపిన విషయాలవల్ల స్పష్టమౌతున్నది. ఈ కొత్త నిర్ణయాన్ని ధృవపరచడానికి, స్థిరపరచడానికి అయితే పునఃపరిశీలన, పునర్విచారణ అవసరం లేదు. యదార్థానికి ఈ పరిశీలన అసలు పథకంపైగాక మంత్రి నిర్ణయంమీదనే జరగాలి. ఈ విషయాన్ని క్రిందటి వారం స్పష్టంచేశాం కూడా.

బుడమేరు వరద నిరోధక పథకం నేటిది గాదు. బుడమేరు వరదవల్ల దాదాపు ఏభైనుంచి దశాబ్దాలుగా ఆ ప్రాంత ప్రజలు అనుభవిస్తున్న బాధలను చూచినవారు ఈ పథకాన్ని సంకల్పించారు. ఇటీవల బుడమేరు, కొల్లేరు వరదల నిరోధానికి ఒక సమగ్ర పథకాన్ని రూపొందించడం ఎక్కువ ప్రయోజనకరమని ఈ శాస్త్రంలో ప్రవీణులైన వారు అభిప్రాయపడ్డారు. ఆ ప్రకారం పథకాన్ని తయారుచేశారు. ఈ పథకంయొక్క వివరాలను,అంచనావ్యయం వివరాలను,ఆదివారం పత్రికలో ప్రకటించాము. ద్వితీయ ప్రణాళికా కాలంలో ఆంధ్రదేశానికి సంబంధించి తయారైన వరద నిరోధకపథకాల అమలుకు 15 కోట్ల రూపాయిలు మాత్రమే కావలసి వుంటుంది. (ఆంధ్ర చీఫ్ ఇంజనీరు పాతిక కోట్ల రూపాయిలు కావాలన్నారు.) కేంద్రప్రభుత్వంపన్నెండుకోట్ల ఎనభైలక్షల రూపాయిలు ఋణంగా ఇవ్వడానికి అంగీకరించింది. ఆ ప్రకారం వివిధ పథకాలకు కేటాయించడం కూడా పూర్తిఅయింది. గోదావరి, పెన్న వరదలనుండి రక్షణకు, బుడమేరు వరద నిరోధానికి, తదితరవనులకు ద్వితీయ ప్రణాళికలో ని మొదటి మూడు సంవత్సరాలు సంవత్సరానికి మూడు కోట్ల రూపాయిల వంతున నాల్గవ సంవత్సరంలో రెండు కోట్ల రూపాయిలు, ఆఖరు సంవత్సరంలో 170 లక్షల రూపాయిలు ఇవ్వడానికి తాత్కాలికంగా నిర్ణయమైంది.

కేంద్రప్రభుత్వం ఈవిధంగా వరదనిరోధక కార్యక్రమాలకుగాను ఆంధ్రరాష్ట్రానికి 1279 లక్షల రూపాయలు ఇవ్వడానికి నిశ్చయించేముందు ఇందుకు సంబంధించిన అన్ని పథకాలను కేంద్ర వరదల అదుపు సంఘం సమగ్రంగా పరిశీలించి ఆ పథకాలను ఆమోదించవలసి వుంటుంది. వరదల అదుపు సంఘం ఈ పథకాల మంచిచెడ్డలను పరిశీలించుచూ వున్నప్పుడే కేంద్రప్రభుత్వ ఆర్థికశాఖవారు ఈ పథకాలకు సంబంధించిన ఆర్థిక సమస్యలను పరిశీలించి నిర్ణయానికి వస్తున్నట్లు కేంద్ర ప్రభుత్వ జల విద్యుచ్ఛక్తి శాఖ ప్రచురించిన కరపత్రం స్పష్టం చేస్తున్నది. అంటే, ద్వితీయ ప్రణాళికలో చేర్చబడిన బుడమేరు పథకం ఈ తతంగం అంతట్నించీ, అందరి పరిశీలనలకు నెగ్గి బయట పడిందన్న మాటే గదా! అసలు కార్యక్రమం ఈవిధంగా వున్నప్పుడు, పథకం అంతా స్థిరపడి శంకుస్థాపనకు తేదీ నిర్ణయమై, నిర్మాణానికి టెండర్లను కూడా పిలిచి ఆఖరుక్షణంలో పథకాన్ని పూర్తిగా మార్చడానికి కారణాలను పబ్లిక్ వర్క్సుశాఖామంత్రి వివరించియుండలేదు.

ఆర్థికశాఖవారు బుడమేరు రిజర్వాయరు నిర్మాణం గిట్టుబాటు వ్యాపారమేనా అని ప్రశ్నించినట్లు, అందుమీదట రాష్ట్ర ప్రభుత్వం బుడమేరు ప్రాంత రైతులను, వారు పొందగల ప్రయోజనాలను గురించి విచారించిందని, రైతులు అందరూ, అభివృద్ధి పన్ను చెల్లించవలసివస్తుందనే భయంతో బుడమేరు వరదలవల్ల తమకేమీ నష్టం లేదని చెప్పారని మంత్రి అన్నారు. ఏ ప్రాజెక్టు విషయంలోనూ జరగని విధంగా బుడమేరు రిజర్వాయరు విషయంలోమాత్రం రైతులను ప్రత్యక్షంగా విచారించడం ఎందుకు జరిగిందో తెలియదు. బుడమేరు వరదలవల్ల ఏ ప్రాంతం ఎంతగా నష్టపడిందో ప్రభుత్వం వద్ద లెక్కలు లేవా? అయినా బుడమేరుప్రాంత ప్రజాప్రతినిధులు వరదనివారణ కార్యక్రమాలకుగాను స్థానికరైతులు ఎకరానికి దాదాపు రెండు వందల రూపాయిలవరకూ అభివృద్ధి పన్ను చెల్లించడానికి సిద్ధంగా వున్నారని ప్రకటించారు. బుడమేరు రిజర్వాయరు నిర్మాణం గురించి రాష్ట్ర ప్రభుత్వం మరి ఏ రైతులనువిచారించిందో తెలియజేయలేదు. రైతుసంఘాలు బుడమేరు సమగ్ర పథకాన్ని సమర్థిస్తూ, ఆ పథకాన్ని వెంటనే అమలు జరపాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు. "ప్రజాభిప్రాయం తెలుసుకొని బుడమేరుపథకం స్థిరపరచడం జరిగింది" అని పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి చేసిన ప్రకటనను పై విషయాలతో సమన్వయం చేయడం సాధ్యం కావడం లేదు.

బుడమేరు రిజర్వాయరు వరద నిరోధానికి అనవసరమనే పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి అభిప్రాయంతో ఏకీభవించినా, రిజర్వాయరువల్ల అదనంగా కొంత భూమి సాగులోకి వచ్చే అవకాశం వున్నప్పుడు రిజర్వాయరును, మళ్లింపు కాలవను సమన్వయ పరచడానికి వారికైనా అభ్యంతరం వుండనవసరం లేదు. వరద నిరోధక పథకంలో రిజర్వాయరునుగాని, తాత్కాలికంగా నీళ్ళను నిలవ చేసే ఏర్పాటుగాని చేయడం వల్ల వెయ్యి ఎకరాలు కొత్తగా సాగులోకి వచ్చి పెట్టుబడిమీద సాలుకు రూపాయివడ్డీ గిట్టుబాటైనా ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం వరద నిరోధక పథకాల్లో రిజర్వాయర్ల నిర్మాణాన్ని కూడా చేర్చింది. ఈ విధంగా చేయడానికి ఆంధ్ర ప్రభుత్వానికి గల అభ్యంతరాలేమో తెలియదు. పబ్లిక్ వర్క్సు మంత్రి అన్నట్లు రైతులు అభివృద్ధి పన్ను చెల్లించడానికి విముఖులుగా వుండి ఈ పథకం వల్ల తమకు లాభం లేదని,బుడమేరు వరదలవల్ల తమకు ఎప్పుడూ నష్టం కలగలేదని వాదించినా, వరద నిరోధక కార్యక్రమం పూర్తి అయినప్పుడు ఈ ప్రాంతం రైతుల నుంచి అభివృద్ధి పన్నును వసూలు చేయరా? పన్ను వసూలు సందర్భంలో కూడా రైతుల ఈ అభిప్రాయాన్ని ప్రభుత్వం పాటిస్తుందా? వరద మళ్లింపు కాలవ వల్ల లాభం పొందే రైతుల నుంచి కొత్తగా, అదనంగా ప్రభుత్వం పన్నులు ఏమీ వసూలు చేయదా?

బుడమేరు రిజర్వాయరు పథకాన్ని బుట్టదాఖలు చేయడానికి పబ్లిక్ వర్క్సుమంత్రి తెల్పిన కారణాలు ఎంత పరిశీలించినా సహేతుకంగా కన్పించడం లేదు. వారన్నట్లు "ప్రజా ప్రతినిధులు ప్రభుత్వానికి నచ్చ చెప్ప లేకుండా వున్నారు. ప్రభుత్వం చెప్పే మాటలను ప్రజా ప్రతినిధులు నమ్మడంలేదు." ఈ రెంటినీ సమాధానపరచడమే 9 వ తేదీన మంత్రివర్గం చేయవలసిన పని. ఈ లోపున పబ్లిక్ వర్క్సుశాఖవారు బుడమేరు సమగ్ర పథకంపై ఇంతవరకూ జరిగిన అన్ని పరిశీలనల వివరాలను వెల్లడించడం అవసరం. ఈ సందర్భంలో ఈ క్రింది విషయాలను పబ్లిక్ వర్క్సు మంత్రి దృష్టికి తీసుకురావడం అవసరమవుతున్నది.

కేంద్రప్రభుత్వ జల విద్యుచ్ఛక్తి శాఖ ప్రచురించిన కరపత్రం ఈపరిశీలనల క్రమాన్ని,పరిశీలనలు పూర్తిఅయినతరువాత పథకాలపై నిర్ణయాలు జరిగే విధానాన్ని ఈ విధంగా వివరించింది: "కేంద్ర ప్రభుత్వం సహాయం చేయడానికి నిర్ణయించేముందు ఈ పథకాలపై సమగ్ర పరిశీలనలు జరుగుతవి. పదిలక్షల రూపాయిలకుమించి ఖర్చుఅయ్యే పథకాలకు సంబంధించిన యావత్తు పరిశీలనా కేంద్రంలోనే జరుగుతుంది. రాష్ట్రప్రభుత్వాలువారి సాంకేతిక ప్రవీణులతో సంప్రతించిన పివరంగా పథకాలను తయారుచేస్తారు. ఈ పథకాలను రాష్ట్ర వరదల అదుపు సంఘాలు ఆమోదించిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంస్థకు పంపుతారు. ఈ సంస్థ సాంకేతిక పరిశీలనలను పూర్తిచేస్తుంది. అదే సమయంలో కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖ ఈ పథకాలకు సంబంధించిన ఆర్థిక వ్యవహారాలను పరిశీలిస్తుంది. అత్యవసర కార్యక్రమాలకు మాత్రం ఈ పరిశీలనలు పూర్తి అయిన వెంటనే డబ్బు మంజూరు చేస్తారు. మామూలు పథకాలను కేంద్ర వరదల అదుపు సంఘం ఆమోదానికి పంపుతారు. రాష్ట్రాలకూ, కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంస్థకూ అభిప్రాయభేదం ఏర్పడితే ఆ పథకంతో సంబంధం వున్న నదీ సంఘానికి నివేదిస్తారు.

బుడమేరు విషయంలో ఈ కార్యక్రమం అంతా పూర్తి అయివుండాలి. మొదట సాంకేతిక ప్రవీణుల సహాయంతో ప్రభుత్వం ఈ పథకాన్ని పరిశీలించి వుండాలి. ఆ పథకాన్ని రాష్ట్ర వరదల అదుపు సంఘం ఆమోదించి వుండాలి. అటుతరువాత కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంఘం పరిశీలించి కేంద్ర వరదల అదుపు సంఘ ఆమోదానికి నివేదించి వుండాలి. కేంద్ర సంఘం ఈ పథకాన్ని ఆమోదించి నందువల్లనే ద్వితీయ ప్రణాళికలో రాష్ట్రానికి వరదల నిరోధక కార్యక్రమం క్రింద 1279 లక్షల రూపాయిలను కేటాయించడం జరిగింది. ఈ విషయాన్ని రాష్ట్ర ప్రభుత్వం కూడా అంగీకరించింది. ద్వితీయ ప్రణాళికలో వరదల నిరోధక కార్యక్రమానికి ప్రత్యేకంగా ఏమీ కేటాయించక పోయినా కేంద్ర ప్రభుత్వం ఇందుకు 1279 లక్షల రూపాయిలు ఇవ్వడానికి నిర్ణయించిందని ప్రభుత్వ ప్రచురణే వెల్లడించింది.

బుడమేరు రిజర్వాయరుతో కూడిన వరద నిరోధక సమగ్ర పథకాన్ని క్రిందటి ఆగస్టులో వరదల అదుపు సంఘం ఆమోదించింది. ఇప్పుడు ఆ నిర్ణయాలన్నింటినీ తోసిరాజనడానికి పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నాన్ని సమర్థిస్తూ వారు వెల్లడించిన అభిప్రాయాలు సమంజసమే అయితే రాష్ట్ర, కేంద్ర వరదల అదుపు సంఘాల్లోని నిపుణులు, ఈ పథకాలను పరిశీలించిన కేంద్ర ఆర్థికశాఖ అధికారులు అంత సమర్థులుకారని, లాభంలేని రిజర్వాయరుమీద 105 లక్షల రూపాయలు ఖర్చు చేయాలని సూచించిన ఇంజనీర్లు అఖర్చును మంజూరు చేసిన ఆర్థిక శాఖవారు బాధ్యతగల సదవులలో వుండ తగరని భావించవలసి వస్తుంది.

వీటన్నింటివల్లా స్పష్టమౌతున్న విషయం ఒక్కటే. ప్రభుత్వ నిర్ణయానికి ప్రధాన కారణం రాజకీయాలు. 9 వ తేదీన మంత్రివర్గ సమావేశం ఈ రాజకీయాలకు అతీతంగా వుండి ప్రజల శ్రేయస్సు దృష్ట్యా మొదటినిర్ణయాన్ని ధృవపరచ గలదా?

### ప్రపంచశాంతి మహాసభ

స్టాక్ హోం, ఏప్రిల్ 1: ఏప్రిల్ 4 నుంచి 9 వరకు స్టాక్ హోంలో ప్రపంచశాంతి మహాసభ జరపాలని శాంతి మహాసభ కేంద్ర సంఘం నిశ్చయించింది. మొత్తం 40 దేశాలనుంచి 600 మంది ప్రతినిధులు ఇందులో పాల్గొన గలరు. వీరిలో 120 మంది కమ్యూనిస్టుదేశాల ప్రతినిధులు.

# కొత్త కంపెనీల శాసనం ఆర్థిక లక్ష్యాలు

[శ్రీ డి. ఎల్. మజుమ్దార్, ఐ. సి. యస్.]

[కంపెనీల శాసనం నిర్వహణశాఖ కార్యదర్శి]

**1913** వ సంవత్సరపు కంపెనీల శాసనాన్ని సమగ్రంగా సవరించడానికి భారతప్రభుత్వం తొలిచర్య తీసుకొని పదిసంవత్సరాలయింది. 1946 మార్చిలో ఆచర్య తీసుకోబడింది. ఒక దశాబ్దం పాటు జరిగిన కృషి యిప్పుడు ముగిసింది.

ఈ క్రొత్త శాసనం ఏప్రిల్ 1 వ తేదీన అమలులోకి వస్తుంది. అదే రోజున రద్దు అయ్యే పాత కంపెనీల శాసనం 42 సంవత్సరాల క్రిందట సరిగా అదే రోజున ఏప్రిల్ 1వ తేదీన అమలులోకి వచ్చింది.

మాకు పూర్వం అధికారంలో వున్న వారికంటే మేము విశేష వంతులము కాదని సంశయార్హులు అంటే అనవచ్చును. ఒకవేళ మేము కాకపోతే కాకపోనూ వచ్చును. కాని యీ మధ్య సంవత్సరాలలో గణించిన అనుభవాన్ని బట్టి శాసనం ఒక సాధనం మాత్రమేనని ముఖ్యంగా ఆర్థిక, సాంఘిక విషయాలకు సంబంధించిన శాసనం, అమలు జరపడానికి ఆ విషయాలను పూర్తిగా అర్థం చేసుకోవాలని అంటున్నాను. అందువల్ల యీ క్రొత్తకంపెనీల శాసనం పూర్వాపరాలను, దాని ప్రధాన సూత్రాలకు సంబంధించిన ఆర్థిక వ్యవహారాలను యిక్కడ వివరించడం అవసరం.

## దృక్పథంలో మార్పు

ఆర్థికశాఖ కంపెనీల శాసనం సవరణకు ప్రతిపాదనలు తయారు చేయడానికి ఉపక్రమించినప్పుడు సాంకేతిక విషయాలు,న్యాయశాస్త్ర విషయాలకు గాక ఆర్థిక విషయాలకు యెక్కువ ప్రాముఖ్య మియ్యబడింది. ఈమార్పును పరిపాలనా నిర్వహణ విధానాలను పరిశీలించేవారు గ్రహించే వుంటారు.

1913 వ సంవత్సరం నాటి కంపెనీల శాసనానికి 1936 లో ఒక పెద్ద సవరణ ప్రతిపాదించ బడింది. అప్పటి భారత ప్రభుత్వ న్యాయశాఖవారు ఆ సవరణను తయారుచేశారు. న్యాయశాఖా సభ్యుడు కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టారు. ఇటీవల కంపెనీల శాసనానికి సవరణలు తలపెట్టినప్పుడు కూడ పూర్వపుపద్ధతినే పాటించారు. ఈ సవరణల విషయమై ప్రాథమిక పరిశీలనను జరిపే బాధ్యత బొంబాయిలోని ఒక ప్రముఖ న్యాయవాదికి, మద్రాసులోని ఒక ప్రముఖ న్యాయవాదికి అప్పగించారు. తర్వాత వర్తక వాణిజ్య ప్రతినిధులు, న్యాయవాదులు, అక్కౌంటెంట్ల ప్రతినిధులు, వాటాదార్ల ప్రతినిధులు గల ఒక ప్రత్యేక కమిటీని నియమించాలని భారత ప్రభుత్వము భావించింది. జాయింటు స్టాకు కంపెనీల సక్రమ పురోభివృద్ధికి, పెట్టుబడి దారులకు, ప్రజలకు రక్షణ కల్పనకు, కంపెనీల శాసనం నిర్వహణకు సంబంధించిన ఇతర విషయాల పరిశీలనకు, ఆ ప్రత్యేక కమిటీ నియమించబడింది.

పై విషయా లన్నిటినీ దృష్టిలో ఉంచుకుని, భారతదేశ కంపెనీల శాసనము చరిత్రలో తొలిసారిగా ఆర్థిక, సాంఘిక దృక్పథాలకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చి, ఆ కమిటీ కృషి సాగించింది. ఈ కమిటీ తయారుచేసిన నివేదికలోని రెండవ అధ్యాయం అతి ముఖ్యమైనది.

కమిటీ నివేదికను పరిశీలించే బాధ్యతను కేంద్ర ఆర్థిక శాఖలోని నిపుణుడయిన ఒక అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరుకు అప్పగించారు, 1936 లో మాదిరిగా ఒక కంపెనీ న్యాయవాదికి ఈ కార్యభారాన్ని అప్పగించలేదు. తర్వాత ఈ బిల్లును రూపొందించడంలోను, పార్లమెంటులో ప్రవేశపెట్టడం లోను ఆర్థిక మంత్రే పూర్తి బాధ్యత వహించారు.

ఈ నివేదికలోని రెండవ అధ్యాయములో పేర్కొన్న విషయాల పుట్టుపూర్వోత్తరాలను పూర్తిగా అందరూ గుర్తించలేదు.

మేనేజింగు ఏజంట్లు, నిర్వహణ వ్యయాల విషయంలో జాయింటు సెలెక్టు కమిటీ కొన్ని ముఖ్యమయిన మార్పులు చేసినా, ప్రధాన సూత్రాల విషయంలో కంపెనీల శాసనం కమిటీ సిఫారసులను మార్పుచేయలేదు.

కమిటీ ప్రధానమైన శిఫారసు ఈ విధంగా వుంది – "వ్యాపార సంస్థల నిర్వహణలో యజమానులకు, కార్మికులకు ఒకప్రత్యేకమైన సంబంధాన్ని కల్పించి చట్టసమ్మతమైన ఒక వ్యవస్థను రూపొందించవలసిన అవసరం వుంది. ఆధునిక కాలంలోని ప్రయివేటు కంపెనీలు కొన్ని ముఖ్యమైన సాంఘిక లక్ష్యాలను, సక్రమమైన నీతిని కలిగి వ్యవహరించాలి. కంపెనీల స్థాపకులు, పెట్టుబడిదారులు, పాలక వర్గాలమధ్య వున్న హితమైన సంబంధం ఏర్పరచడానికి ప్రస్తుత వ్యవస్థనుమార్పు చేయడానికి ఎంతవరకు సాధ్యమౌతుందో పరిశీలించడం మా లక్ష్యం. అందువల్ల ఆశించబడే ప్రయోజనాలు యివి: అంగీకరించ బడిన ప్రమాణాల మేరకు కార్పొరేటు సంస్థలప్రాశస్త్యం పెంపొందడం, వాటాదార్ల సక్రమమైన హక్కులను గుర్తించి, కంపెనీల పాలకశాఖ యొక్క సామర్థ్యాన్ని పెంచడం, భాగస్వాములు, కార్మికులు, వినియోగదారుల హక్కులను రక్షించడం, ఈ దేశంలో కార్పొరేట్ సంస్థల సక్రమ నిర్వహణ ద్వారా సాంఘిక లక్ష్యాలను సాధించడం."

క్రొత్తకంపెనీల బిల్లు సెలెక్టుకమిటీ నుంచి తిరిగివచ్చిన తర్వాతపార్లమెంటులోను, ఇతరత్రాను జరిగిన చర్చలలో వామపక్షంవారుగాని, తదితరులుగాని బిల్లు ప్రధాన సూత్రాలకు అభ్యంతరం చెప్పలేదు. కాకపోతే,బిల్లులోని నిబంధనలు కార్పొరేటు సంస్థల ప్రాధాన్యానికి ప్రతిబంధకం కాగలవని కొందరు, ఈ నిబంధనలు కట్టుదిట్టంగా లేవని మరి కొందరు విమర్శించారు.

కంపెనీల శాసనం ప్రయివేటు కంపెనీలకు మాత్రమే వర్తిస్తుందనే అభిప్రాయం ఎక్కువ మందిలో కనిపిస్తున్నది. అది పూర్తిగా నిజంకాదు. జాయింటు స్టాకు కంపెనీలవిధానం వ్యవసాయం మినహా ఇతర ప్రయివేటు పరిశ్రమలన్నింటికీ వర్తిస్తుంది. ఇప్పుడు దీన్ని పబ్లిక్ రంగానికి కూడా విస్తరింప చేస్తున్నారు.

## ప్రభుత్వ సంస్థలు

ఐదుసంవత్సరాలక్రిందటి వరకూ, ప్రభుత్వ పరం చేయబడిన వాణిజ్య, పారిశ్రామిక సంస్థల నిర్వహణను, చట్టపూర్వకంగా నియమించిన ఒక సంస్థ చూస్తున్నది. ఇటీవల ఆ విషయంలో కొన్నిమార్పులు తలపెట్టబడ్డాయి. ఈ క్రొత్త కంపెనీల శాసనంలో ప్రభుత్వ కంపెనీలకు వర్తించే ప్రత్యేక నిబంధనలున్నాయి. ప్రభుత్వ సంస్థలకు వాటిని వర్తింప చేయడానికి కంపెనీల శాసనంలో మార్పు చేయడానికి ప్రభుత్వానికి ఈ నిబంధనలు అధికారమిస్తున్నాయి, అట్టి మార్పులు పార్లమెంటు ఉభయసభల అమోదంతో జరగాలనే నిబంధన ఒకటి వున్నది.

ఆ సమస్యను భవిష్యత్తులో ఎదుర్కొనవలసివుంది.ప్రస్తుతానికి, ఈక్రొత్త శాసనం నిబంధనలలో అంతర్భూతమైవున్న ఆర్థిక లక్ష్యాలు, ముఖ్యంగా ప్రయివేటు రంగానికి వర్తించే విషయాలని తేలికగా నిర్వచించవచ్చును. కంపెనీల స్థాపన, అందుకు సంబంధించిన నిబంధనలు, పెట్టుబడి ధనం మొదలైన వాటికి సంబంధించిన నిబంధనలు అమెరికా, బ్రిటనులలోని స్టాకు ఎక్స్ఛేంజి విధానాలను గట్టిగా అనుసరించాలని నిర్దేశిస్తున్నాయి. 1948 వ సంవత్సరం బ్రిటిషుకంపెనీల శాసనంలోని ఈ విషయానికి సంబంధించిన నిబంధనలు ఈ క్రొత్త శాసనంలో ఆ విషయాలకు సంబంధించిన నిబంధనలు బ్రిటిషు కంపెనీల శాసనంలోవే. లండను స్టాకు ఎక్స్ఛేంజి నిబంధనలనుంచి తీసుకోబడినవే.

అసలు పెట్టుబడిదారులకు పూర్తి రక్షణ కల్పించి, ఆ రక్షణ ద్వారా నిలవచేసే పద్ధతిని పెట్టుబడి పెట్టే పద్ధతిని సక్రమంగా ప్రోత్సహించాలనేదే ప్రధాన లక్ష్యం.

వాటాలు, సెక్యూరిటీలు, ప్రాస్పెక్టసులకు సంబంధించిన విషయాల నిర్వహణ బ్రిటను, అమెరికాలలో స్టాకు ఎక్స్ఛేంజిలే నిర్వహిస్తాయి. భారతదేశంలోని స్టాకు ఎక్స్ఛేంజిలుకూడ అట్టి ప్రశంసనీయపాత్రను నిర్వహించడానికి వీలు కల్పించడానికి ఇప్పుడు పార్లమెంటు పరిశీలిస్తున్నది. కంపెనీల స్థాపనకు సంబంధించి క్రొత్త శాసనంలోవున్న నిబంధనలు పెట్టుబడి మార్కెటును అదుపులో పెట్టడానికి తగిన చట్టపూర్వకమైన అధికారాన్ని కల్పిస్తున్నది.

## ఆర్థికరంగం

ఈ క్రొత్త శాసనంలోని కంపెనీ మీటింగులు, కంపెనీ వ్యవహారాల విచారణ మొదలైనవాటికి సంబంధించిన నిబంధనలు చేర్చడంలో ఉద్దేశ్యం కంపెనీల వాటాదార్లకు కంపెనీల పాలకవర్గంపై సక్రమమైన ఆధిపత్యం కల్పించడం, వారి హక్కులకు భంగం కలిగితే కేంద్రప్రభుత్వం ద్వారా గాని, న్యాయస్థానాల ద్వారా గాని న్యాయం కలిగించుకోడానికి అవకాశం కల్పించడం, కంపెనీల వ్యవహారాల అక్రమ నిర్వహణను నిరోధించడం, వాటాదార్లలోని అధిక సంఖ్యాకులకు కష్టం కలిగించకుండా చూడడం ప్రభుత్వ ప్రధాన బాధ్యత.

ఈ నిబంధనలవల్ల ప్రయోజనాలు ఎంతవరకూ చేకూరగలవన్నప్రశ్న అనేక ఇతర విషయాలమీద ఆధారపడివున్నది. వాటాదార్లు తమ అధికారాలను, బాధ్యతలను శక్తిమంతంగా నిర్వహించడం మీద,ఎక్కువగా ఆధారపడివుంటుంది.

## ప్రభుత్వ లక్ష్యాలు

కంపెనీల నిర్వహణ సక్రమంగా కొనసాగడానికి, లోగడ వున్నటువంటి లోపాలను పారద్రోలి, సక్రమంగా సాగే క్రొత్త సంస్థలను ప్రోత్సహించడానికి జాయింటు స్టాకు కంపెనీలు నిర్వహణలో పాలకవర్గానికి కావలసినంత స్వయం నిర్ణయాధికారాన్నిస్తూ, దుర్నీతిలు, అక్రమ వ్యవహారాలను తొలగించి, ఆర్థిక సాంఘిక లక్ష్యాలను సాధించడానికి ఈ శాసనం అవకాశాన్ని కల్పిస్తున్నది.

అడ్మినిస్ట్రేటరు తమ విధి బాధ్యతలను సక్రమంగా నిర్వహించడానికి, వారికి అందచేయబడే విధానాలకు సంబంధించిన తీర్పులపై ఆధారపడితే సరిపోదు. ఆ తీర్పులయొక్క ఉద్దేశ్యాలు కూడ వారికి తెలిసి వుండాలి. ఈ క్రొత్త శాసనం ఏప్రిల్ ఒకటో నుంచీ అమలులోకి రావడంతో దీని ఆర్థిక ప్రాముఖ్యాన్ని ప్రజలు గుర్తించినట్లయితే, వారి పని సుగమం కాగలదు.

# వృత్తి విద్యా కేంద్రాలు

## అవసరమని కిసాన్ సమ్మేళన విజ్ఞప్తి

గుంటూరు, మార్చి 31: వ్యవసాయాభివృద్ధికి వీలుగా మరికొన్ని పాఠశాలలు, కళాశాలలను, వృత్తి విద్యలను ప్రోత్సహించేందుకు వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలను ఏర్పాటు చేయించమని ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న జరిగిన సమావేశంలో గుంటూరుజిల్లా కిసాన్ సమ్మేళనం కార్యకర్తలు తీర్మానించారు. శ్రీ కల్లూరి వీరయ్య అధ్యక్షత వహించారు. వ్యవసాయశాఖ మంత్రి శ్రీ కంచుల ఓబుల రెడ్డి కూడా సమావేశానికి వచ్చారు.

రైతుల ప్రస్తుత సమస్యలను వివరించుచూ శ్రీయుతులు లావు అంకన్న, పనిగళ్ల సత్యనారాయణ, పాటిబండ్ల సీతారామయ్య, అన్నే సూర్యనారాయణ, దరువూరి వీరయ్య, కిలారు రామస్వామి చౌదరిగారలు ప్రసంగించారు.

గుంటూరు సమీపంలో పశువైద్య కళాశాలను నెలకొల్పాలని లోగడ జరిగిన నిర్ణయాన్ని అనుమజరపమని ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేశారు. 18 వ నంబరు సమూనా రసీదులను ఇవ్వవలసిందిగా ప్రభుత్వం ఆదేశించినా గ్రామోద్యోగులు అట్లా చేయడం లేదన్న విషయాన్ని ప్రభుత్వదృష్టికి తెచ్చి తగు ఏర్పాటు చేయించమని మరొక తీర్మానం లో ప్రభుత్వాన్ని అభ్యర్థించారు.

ధరలు నిలబడడానికి అవసరమైన ఏర్పాట్లు చేయమని కోరారు. ఇప్పటికే పన్నులు ఎక్కువగా ఉన్నవి. కనుక క్రొత్తపన్నులతో రైతులను బాధపెట్టవద్దని ప్రభుత్వానికి వేరొక తీర్మానంలో విజ్ఞప్తిచేశారు. ఆయుర్వేద వైద్యాన్ని గురించి ప్రోత్సహించమని మరొక తీర్మానంలో కోరారు. న్యాయమూర్తి శ్రీ కాసతేంద్రరావు మరణానికి సంతాపం ప్రకటించుచూ కూడా తీర్మానించారు.

# మురికి పేటలు: శ్రీ నెహ్రూ హెచ్చరిక

1. వ పేజీ 1 వ కాలం తరువాయి

సన్మానించారు.

### కొంపలతీరు

కొన్ని చోట్ల మాపాలుమాసేపరికి శ్రీ నెహ్రూ చింతాక్రాంతులైనారు. ఈ డిపా మన్న గడ్డికప్పులు, మప్పవ ప్పా కె నుల నీడకట్లు వ ళ్ళ న తో న్పు, చింకి పేలికలు, గోనుపరదాలు మొదలైన్నీ కొంత సేపు విషాదంతో గమనించారు. ఒకచోట కొందరు వీధి ఊడుస్తున్న వాళ్లు ఒకచేత చీపురు, మరోచేతిలో పూలదండా పట్టుకొని శ్రీ నెహ్రూ వద్దకు పరుగెత్తుకవచ్చారు.

### సంపాదనకు మించిన కిరాయి

శ్రీ నెహ్రూ కొన్ని చీకటి గుయ్యారాల్లోకి తొంగిచూశారు. ఒక గది పదడుగుల పొడుగు, ఆరడుగుల వెడల్పు ఉంది. దీనికి రూ 15 అద్దె ఇవ్వాలని యజమాని బాధపెడుతున్నాట్ట. అతడి సంపాదనకే నెలకి పది హేను కూడా లేదు.

ఒక చోట ఒక బాలిక పక్క మురికి గుంటలో పడిపోయింది. శ్రీ నెహ్రూ తిటాలున వెళ్ళి ఆమెను లేవదీసి ఒక పూలదండ యిచ్చి సముదాయించారు.

### గూళ్లలో నివాసం

కొన్ని గదియల్లో నిలబడటానికి పదడుగులు దిగవలసి ఉన్నాయి. పూర్వం షాజహాన్ నిర్మించిన ప్రాకారం గూళ్లలో కొందరు నివసిస్తున్నారు. కసాయి దావళ్లవద్ద మనుషులూ పశువులూ ఒక్కచే నివాసం.

నగర ప్రాకారం లోపల షాజహాన్ ఢిల్లీలో ఆ పేటని 60 వేల ప్రజల కోసం నిర్మించారు. ఇప్పుడక్కడ 6 లక్షల మంది నివసిస్తున్నారు.

మురికి పేటల పరిశీలనకోసం శ్రీ నెహ్రూ రు 10 వేలు ఖర్చు మంజూరు చేశారని భారత సేవక సమాజ కార్యకర్త ఒకరు చెప్పారు. పరిసరాల పారిశుద్ధ్యంకోసం ఒకచోట కార్యక్రమానికి లక్షన్నర రూపాయలు మంజూరు చేశారు. అధికారులు, ఇల్లియజమానులు, నివాసులు సమాజసేవకుల సహకారంతో యీ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

ఈ కార్యక్రమం ఫలితాలనుచూసి, బాగుంటే, ఢిల్లీలో నగర పారిశుద్ధ్య శాఖాధికారులు ఈ పద్ధతుల్ని అనుసరిస్తారు.

# సంపాదకునకు లేఖలు

## విజయవాడ పురంలో- పన్నులభారము

ఆర్యా! ఆంధ్ర రాష్ట్రములో గల అన్ని మ్యునిసిపాలిటీలలో విజయవాడ మ్యునిసిపాలిటీ ఆదాయములో మాత్రము ప్రథమస్థాన మలంకరించుచున్న విషయము లోకవిదితమై యున్నది. ఇట్టి మ్యునిసిపాలిటీలో రెండు మూడు సంవత్సరముల క్రిందట జనరల్ రివిజన్ అను పేరులో యింటి పన్నులను విపరీతముగ పెంచి యున్నారు. ఈ పెంపుదల ననుసరించి ప్రస్తుతము నూటికి 25 వంతుల వరకు ఇంటి పన్ను విధింపబడుచున్నది. ఈభారీ పెంపుదల ప్రకారము పూర్వపు పన్నులు పదిరెట్లు పైగను పెంచబడిన పరిస్థితులు కొన్ని గలవు. ఇట్టి పెంపుదలవల్లనన్న విపరీత ఆదాయము పట్టణ అభివృద్ధికి చాలుటలేదు కాబోలు అన్నట్లు తిరిగి యీ పన్నులను నూటికి 30 వంతులవరకు అనగా యిప్పటి పన్నులపై రూపాయకు నాలుగు అణాలు చొప్పున పెంచుటకు మ్యునిసిపల్ కౌన్సిలులో తీవ్ర ఘర్షణలు జరుగుచున్నవి. మద్రాసు బొంబాయి, కలకత్తా మహాపట్టణములలో కూడ ఇట్టి విపరీత పన్నులభారము కానరాదు. ఏకొద్దిమందో మినహా, మిగిలిన పన్ను చెల్లింపుదారులు యిప్పుడు అమలులోవున్న పన్నుల భారముచే క్రుంగిపోవుచుండ ఈ పన్నులు తిరిగి పెంచబడిన యెడల అదివారలకు విపరీతమైన గొడ్డలి పెట్టుగా భావింపబడగలదు. ఈ విషయమై ప్రజలలో తీవ్రమయిన అసంతృప్తి బయలుదేరినది. అంతేగాక ముందు యింకెన్ని పర్యాయములు పెంపుదలలు రాగలవో అను భీతియు కూడ కలుగుచున్నది. పట్టణ అభివృద్ధికి ప్రజా శ్రేయస్సుకు ఎక్కువగా తోడ్పడక పోయినప్పటికిని, మ్యునిసిపల్ కౌన్సిలర్సు, వారియొక్క ముఠా రాజకీయతత్వము యిట్లు ప్రజల ఆర్థిక పరిస్థితితోటి చెలగాటము లాడుటకు మాత్రము వినియోగపడుచున్నది. ఇదంతయు బ్రహ్మాండముగా పట్టణాభివృద్ధి కొరకా యన్న యట్టిది యోచనకు కూడ అందనివిషయము. ప్రస్తుతము పన్ను మ్యునిసిపాలిటీ ఆదాయముతో సవ్యముగ కౌన్సిలర్సు ఐకమత్యముతో ప్రజాభిప్రాయమును స్వీకరించి వ్యవహారించినచో పట్టణ పురోభివృద్ధి విరివిగా తోడ్పడి ప్రజల అదరాభిమానముల పొందగలుగుటేగాక మ్యునిసిపల్ ఆదాయములో కొంత ప్రత్యేక స్కీములకు మిగుల్చుటకుకూడ అవకాశము కలుగగలదు. కాని, అట్టి అభిప్రాయము లేకుండ, పన్నులు ఎన్ని విధముల ఎంత పెంచినప్పటికిని, ఎంత ఆదాయము వచ్చినప్పటికిని మ్యునిసిపల్ పరిపాలన అవకతవకగా నడుపక మానదు. ప్రజల తరపున, ప్రజలకు పరిపాలనా సౌఖ్యము అభివృద్ధి కలుగ చేయవలెనను ఉద్దేశ్యము తో ప్రజలు కౌన్సిలరులను ఎన్నుకొనిరిగాని, ప్రజలపై పెత్తనము చలాయించుటకును ప్రజలలో అసంతృప్తిని చలరేగించుటకును గాదు. ఇట్టి పరిస్థితులలో కౌన్సిలరులలో పరివర్తనము వచ్చువరకు, కౌన్సిలును ప్రభుత్వము వెంటనే రద్దుచేసి మునిసిపల్ పరిపాలన ప్రభుత్వమే కొంతకాలము నడిపిన యెడల బాగుండగలదు.

కనుక రాబోవు పన్నుల పెంపుదలను గూర్చి తీవ్రమైన అసంతృప్తిని ప్రకటించుచూ, విజయవాడ మ్యునిసిపల్ పరిపాలనా విషయమును గూర్చి ప్రభుత్వముపై ఒత్తిడి తేవలసిన బాధ్యత ముఖ్యముగా విజయవాడ పన్ను చెల్లింపుదార్లపైననే యుండుటయేగాక, ఆంధ్ర రాష్ట్రములోని ఇతర పట్టణములలోని ప్రజలపైకూడ,వారి మ్యునిసిపాలిటీలలో ఇట్టివి కలుగకుండ చూచుకొనవలసిన బాధ్యత యున్నది.

ఒక న్యాయవాది.

* * *

## మార్కాపురానికి పురపాలకసంఘం

ఆర్యా, మార్కాపురమును పరిసర గ్రామాలను కలిపి పురపాలక సంఘంగా ఏర్పాటు చేయడానికి స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టర్ జనరల్ చేసిన సూచనను పంచాయతీబోర్డు, ప్రజాసంస్థలుకూడా ఆమోదించాయి. తరువాత స్థానికశాఖా మంత్రి శ్రీ నాగేశ్వరరావు ఈ పట్టణం సందర్శించి సంతృప్తి వెల్లడించారు. త్వరలో పురపాలక సంఘం ఏర్పడగలదని హామీ యిచ్చారు. కాని యింతవరకు ఎట్టి చర్యలు ఎవరూ తీసుకోలేదు. అధికారులు, ఈ విషయమై శ్రద్ధ వహిస్తారని ఆశిస్తాను.

మార్కాపురం. జట్రపోలు సౌమిత్రిశర్మ.

* * *

## పెద అవుటుపల్లివద్ద ఏలూరు కాల్వ వంతెన

ఆర్యా!

ఏలూరు కాల్వకు వంతెన 1932 లో పూర్తయింది. అప్పటినుంచి యిప్పటి వరకు ఒక్క సారయినా దానికి మరమ్మతు జరగలేదు. వంతెనపైనున్న కంకర అంతా లేచిపోయి బండ్లకు ప్రమాదం కలుగుతున్నది. బోర్డువారు, ప్రభుత్వంకూడా శ్రద్ధ తీసుకోవడం లేదు. బండ్లు అప్పుడప్పుడు పడిపోతున్నవి. ఇకనైనా తగు శ్రద్ధ వహించగలరని ఆశిస్తాను.

పెద అవుటపల్లి. వేగేవెంకయ్య.

## మలయాలో దౌర్జన్య చర్యలు

### కమ్యూనిస్టునాయకుని ప్రతిపాదన

సింగపూర్, ఏప్రిల్ 1: 8 సంవత్సరాలనుంచీ మలయాలో సాగుతున్న పోరాటాన్ని నిలిపివేసేందుకు మళ్లీ సంప్రదింపులకు తాము సిద్ధమని మలయా కమ్యూనిస్టు పక్షం కార్యదర్శి చిన్ పెంగ్ ముఖ్యమంత్రి టెంకూ అబ్దుల్ రహమానుకు రాసిన లేఖ ప్రతులు అధికారవర్గాలు పంపుతున్నాయి. అయితే కమ్యూనిస్టులకు ఇతర రాజకీయపార్టీలతో సమానస్థానం ఇచ్చి, వారిమీద ప్రతిచర్యలు జరపకుండా ఉంటేనే వారు లొంగగలరని చిన్ పెంగ్ తన లేఖలో స్పష్టపరిచారట.

లోగడ బేలింగ్‌లో జరిగిన సమావేశంలో చిన్ పెంగ్ ఇవే షరతులను ప్రతిపాదించగా ముఖ్యమంత్రి అబ్దుల్ రహమాన్ నిరాకరించారు.

### సింగపూర్ పరిస్థితి

సింగపూర్, ఏప్రిల్ 1: సింగపూర్‌లో శాంతిభద్రతలు భగ్నమయితే బ్రిటిష్ సైన్యం జోక్యం కలిగించుకునేందుకు సింగపూర్ ముఖ్యమంత్రి డేవిడ్ మార్షల్ సుముఖంగా ఉన్నట్లు తెలుస్తున్నది. సింగపూర్ స్వాతంత్ర్య సమస్యపై సంప్రదింపులకు వెడుతున్న ముఖ్యమంత్రి ఈ వరకుతోనే ఒక పథకాన్ని తయారుచేసినట్లు తెలుస్తున్నది. ఈ పథకం ప్రకారం, ఒక ఏడాదిపాటు పరిమిత స్వపరిపాలన అనుభవించిన తరువాత సింగపూరుకు స్వాతంత్ర్యం రాగలదని ఆయన ఆశిస్తున్నారట.

ఈ పథకాన్ని సింగపూర్ ప్రతినిధి వర్గంలో ఉండే వివిధ రీలు ఆమోదించవలసి వున్నది.

## రాష్ట్రంలో ధాన్యం ధరలు

### కేంద్ర ఉపమంత్రికి విజ్ఞప్తి

న్యూఢిల్లీ, మార్చి 31: ఆంధ్రరాష్ట్ర బియ్యంమిల్లుల యజమానుల సంఘం కార్యదర్శి, శ్రీ ఎస్. భక్తవత్సలం, శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖల ఉపమంత్రి శ్రీ ఎం. వి. కృష్ణప్పను కలుసుకొని ఆంధ్రలో ప్రస్తుతం వున్న ధాన్యం ధరలపట్ల సంతృప్తి వెలిబుచ్చుతూ ఒక విజ్ఞప్తి సమర్పించారు. ఆ సందర్భంలో జరిగిన సమాలోచనల్లో ఆహారశాఖ డైరెక్టర్ జనరల్ శ్రీ ఎస్. ఎన్. ఖల్లా కూడా పాల్గొన్నారు.

విజ్ఞప్తిలో ఇట్లా ఉన్నది: "ఆహారశాఖ ప్రాంతీయ డైరెక్టర్లు, సెంట్రల్ వేర్‌హౌసింగ్ కార్పొరేషన్ల సంస్థద్వారా బియ్యం కొనాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించిన విధానం ఫలితంగా ఆంధ్రలో ధాన్యంధరలు ఇప్పుడు సంతృప్తికరంగా ఉన్నవి. 1955 డిసెంబరులో ధాన్యంధరలు విపరీతంగా తగ్గిపోగా ధర నిలబెట్టేందుకువీలుగా ధరలమార్పు సంఘం సిఫార్సులకు అనుగుణంగా మణుగు ధాన్యం ధర రు 7-కు తగ్గితే ఆ ధరకు తాము ధాన్యం కొంటామని ఆంధ్రప్రభుత్వం ప్రకటించారు. ప్రస్తుతం ఆంధ్రలో మణుగు ధాన్యం రు 12-8-0 అమ్ముతున్నది. యీ ధర పంట పండించే వారికీ, వర్తకులకు కూడా సంతృప్తికరంగా ఉన్నది. ఇంకా ధర పెరిగే అవకాశం ఉన్నది. కనుక ధరలు నిలబెట్టడానికని కొందర్ల పిలిచిన బియ్యాన్ని ఇప్పుడప్పుడే తీసుకోవద్దని—కొంత కాలం ఆలస్యం చేయమని అధికారులను కోరుతున్నాం."

"బియ్యం మిల్లులకు తగినంత అనుమతులు ఇచ్చేపద్ధతిని 1956నుంచి నిలిపివెయ్యాలన్న ఆంధ్రప్రభుత్వ విధానం వల యీ పరిశ్రమకు పెద్దదెబ్బ తగిలే అవకాశం ఉన్నది. కేవలం ఒక్క రాష్ట్రంలో ఇటువంటి విధానాన్ని అమలుచేస్తే వ్యాపారంలో ఒడిదుడుకులు వస్తవి. విదేశాలనుంచి మరబియ్యం దిగుమతి అయ్యే ప్రమాదం ఉన్నది. ఇప్పటి పరిస్థితులలో మరబియ్యాన్ని నిషేధించడం, సాధ్యం కాదు. కనుక యీ వ్యవహారంలో జోక్యం కలిపించుకొని తగు ఏర్పాటు చేయమని కేంద్రప్రభుత్వాన్ని కోరుతున్నాం."

## రంగూన్‌లో ఆస్పత్రి క్రీడా కేంద్రాలు

### సోవియట్ సహాయంతో

రంగూను, ఏప్రిల్ 1: రంగూనులో ఒక ఆస్పత్రికీ, ఒక నాటకశాలకూ, ఒక క్రీడా వినోద కేంద్రానికీ కావలసిన పరికరాలను సమకూర్చుతామని రష్యా చేసిన ప్రతిపాదనకు బర్మా ఆమోదించింది. బర్మా ప్రధాని శ్రీనూ, సోవియట్ ఉప ప్రధాని శ్రీ మికోయాన్ కలిసి ఇచ్చిన సంయుక్త ప్రకటనలో ఈ విషయం తెలియజేశారు. ఈ సహాయానికి ప్రతిగా బర్మా కొంత బియ్యాన్ని రష్యాకు పంపుతుంది.

క్రీడా వినోద కేంద్రంలో ఒక స్టేడియం, సాంకేతిక, వ్యవసాయ ప్రదర్శనలకు శాశ్వత భవనాలు, ఒక భవనం ఒకటి, హోటలు ఒకటి ఉంటాయి.

రష్యా ఒక సాంకేతిక సంస్థనుకూడా

## కార్మికులకు ప్రోత్సాహం

### కేంద్ర సంఘం గోష్ఠి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: కార్మికులు చక్కగా పని చేసేందుకు తగిన ప్రోత్సాహం కల్పించటానికి 'ఉత్పత్తి బోనస్' లాంటి బిరుదులు యివ్వటంలో పాటు, దేశం మొత్తంమీద పారిశ్రామిక సంస్థలలో పనిచేస్తున్న కార్మికులకు అందరికీ, జీతంమీద యిచ్చే శెలవులు, సంవత్సరంలో పనిచేయాల్సిన రోజులు తదితర అంశాలను ఒకస్థాయిలో ఏర్పాటు చేయడానికి ఆలోచనలు జరుగుతున్నాయి.

ఈనెల 4వ తారీఖున జరిగే కేంద్ర కార్మిక సంఘం తను 15వ సమావేశంలో యీ విషయాలపై చర్చలు జరుపుతుంది.

రెండు రోజులపాటు జరిగే యీ సమావేశానికి కేంద్ర కార్మికమంత్రి శ్రీ ఖండూభాయ్ కె. దేశాయ్ అధ్యక్షత వహిస్తారు.

ఈ సంఘం, కార్మికులకు యిస్తున్న కరువు భత్యంలో కొంత భాగాన్ని జీతంతో కలిపే ప్రతిపాదనను కూడా చర్చిస్తుంది.

రహదారులరవాణా కార్మికుల స్థితిగతులను బాగుచేయటానికి ప్రత్యేకముగా శాసనం చేయాలని యీ సంఘం ఆలోచిస్తున్నది.

వీరిని ఉద్యోగంనుంచి తొలగించే పక్షంలో ఇవ్వాల్సిన పరిహారం, పదవీ విరమణ వయస్సు, ఫ్యాక్టరీలలో పని చేసే కార్మికులకు ఒక నిధిని (గ్రాట్యుటీ) ఏర్పాటు, ప్రావిడెంటు ఫండు వసతులను పారిశ్రామిక కార్మికులకు అందరికీ విస్తృతం చేయటం—తదితర అంశాలను ఈ సంఘం విపులముగా చర్చిస్తుంది.

## అంతర్జాతీయ ఒడంబడికలు

### పాకిస్తాన్ అధ్యక్షుని ప్రకటన

లాహోర్, ఏప్రిల్ 1: కాశ్మీరు సమస్యను పరిష్కరించి తీరుతుందని పాకిస్తాన్ దీక్ష వహించిందనీ, ఈ దీక్షనుంచి ప్రపంచంలో ఎంతటి శక్తిగాని తమని మార్చలేదనీ పాకిస్తాన్ అధ్యక్షుడు శ్రీ ఇస్కందర్ మిర్జా అన్నారు.

భారత దేశంతో సహా సకలదేశాలూ ఆమోదించిన అంతర్జాతీయ ఒడంబడికల్ని శ్రీ నెహ్రూ త్రోసి పుచ్చారని శ్రీ మిర్జా అన్నారు.

"తన పట్టుదల మూలంగా ఒక దేశం అంతర్జాతీయఒడంబడికల్ని ఈ విధంగా నిర్లక్ష్యపరిచినట్లయితే, ఇంక ప్రపంచంలో శాంతి సుస్థిరతలకే ఆశపడ్డం అనవసరం" అని శ్రీ మిర్జా అన్నారు.

తమ కాశ్మీర్ సహోదరుల్ని నిస్సహాయంగా అపరిహితంగా అలా ఎన్నడూ పాకిస్తానీలు విడిచిపెట్టరన్నారు.

ఏది ఏమయినాసరే కాశ్మీరు సమస్యని న్యాయంగా పాకిస్తాన్ పరిష్కరించి తీరుతుందన్నారు.

శ్రీ నెహ్రూ ప్రకటన పాకిస్తాన్ దేశాన్ని చకితం చేసిందన్నారు.

### అసలు సమస్యలు

పాకిస్తాన్‌కి అపాయకరమైన సమస్యలనేకం వచ్చాయన్నారు. అందులో కాశ్మీరు సమస్య దేశానికంతటికీ అత్యంత విషాదం కలగజేస్తోంది.

పాకిస్తాన్‌లో విద్యా, వైద్యసౌకర్యాలు లోపంగా ఉన్నాయి. ఆహారం, వస్త్రం ధరలు బాగా పెరిగిపోయాయి. సామాజిక సైన్యం అన్నట్టే ఎక్కడా కనిపించడం లేదని శ్రీ మిర్జా చెప్పారు.

పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరు ప్రాంతాలను ఏప్రిల్ 8 మొదలు పాకిస్తాన్ అధ్యక్షుడు శ్రీ ఇస్కందర్ మిర్జా పర్యటిస్తున్నారు.

కాశ్మీర్ ముస్లిం సమావేశం, లాహోర్ వర్గం అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఆలం ఏప్రిల్ 8వ తేదీని "కాశ్మీరు దినోత్సవం"జరపాలని ఆదేశించారు.

## బెజవాడ స్టేషన్ ముందు రైళ్ల పడిగాపులు అక్కరలేదు

### బ్రాడ్‌గేజ్ ప్లాట్‌ఫారం నిర్మాణం: అభివృద్ధి చర్యల ప్రథమ దశ

విజయవాడ, ఏప్రిల్ 2: ఇదివరకు మీటర్ గేజి బండ్లు నిలచే ప్లాటుఫారాన్ని బ్రాడ్ గేజిప్లాటుఫారంగా మార్చడంవల్ల, సెంట్రల్ రైల్వే నుంచి వచ్చే బండ్లకు యిబ్బంది తొలగింది. ఔటర్ సిగ్నల్ వద్ద గంటలతరబడి పడిగాపులు పడి ఉండవలసిన బాధ లేకుండా, ఆ బండ్లు సరాసరి స్టేషను లోకి వచ్చే వీలేర్పడింది.

ఈ ప్లాటుఫారం నిర్మాణంతో, విజయవాడ రైల్వేస్టేషన్ అభివృద్ధి కార్యక్రమంలో మొదటి దశ పూర్తి అయింది. దక్షిణరైల్వే ప్రాంతీయ ఇంజనీరు శ్రీ ఒ.ఎం. . చాకో నిన్న కొత్త ప్లాటుఫారానికి ప్రారంభోత్సవం చేశారు. (ఈ వార్తను సంగ్రహంగా నిన్న నే ప్రచురించాం)

ప్రాంతీయ ట్రాఫిక్ సూపరింటెండెంట్, శ్రీ డి. బి. పటేల్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, యీ ప్లాటుఫారంవల్ల, సెంట్రల్ రైల్వే బండ్లకు ఇబ్బందులు తొలగిపోగలవని అన్నారు.

### 1915 నాటిది

విజయవాడస్టేషన్ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహించే ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, శ్రీ జె. హారిస్ యీ ఉత్సవ సందర్భంలో జరిగిన సభలో మాట్లాడుతూ, ఇప్పటి స్టేషన్‌భవనం, ఆవరణ, 1915 ప్రాంతంలో ఏర్పడినవని, అప్పటినుంచి, నానాటికి పెరుగుతున్న రవాణా రాకపోకలకుతగ్గట్టుగా స్టేషన్ అభివృద్ధి జరుగుతూనే ఉన్నదని, దేశములో వ్యవసాయపారిశ్రామిక, ఖనిజ పరిశ్రమలు అభివృద్ధి అవుతున్నకొలదీ యీ స్టేషన్, ఆవరణ చాలడంలేదని, అందువల్ల 97 లక్షల 88 వేల ఖర్చు పెట్టి స్టేషన్‌ను ఆవరణను అభివృద్ధి చేయడానికి నిశ్చయించడమైనదని చెప్పారు. స్టేషన్ పునర్నిర్మాణ కార్యక్రమం మొదటిదశలో, మీటర్ గేజికి, ద్వీపంమాదిరి ఒక ప్లాటుఫారం నిర్మించి, పూర్వంఉన్న మీటర్ గేజి మార్గాలను బ్రాడ్ గేజి మార్గాలుగా మార్చడం, ఈ దశ నిన్నటితో పూర్తి అయింది.

ఈ పని, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ హారిస్ ఆధ్వర్యాన, డివిజనల్ ఇంజనీరులు శ్రీ శర్మ, నటేశన్, సుబ్బారావు నాగిరెడ్డి, దొరైస్వామి పర్యవేక్షణ క్రింద అతిస్వల్పకాలంలో పూర్తి చేశారు. పునర్నిర్మాణ పథకంక్రింద విజయవాడస్టేషన్‌లో,యీ దిగువపనులు చేస్తారని, శ్రీ హారిస్ వెల్లడించారు.

### కొత్త ప్లాట్‌ఫారాలు

'మీటర్ గేజి మార్గాలకు కొత్త ప్లాటుఫారం నిర్మాణం, పాతమీటర్ గేజి ప్లాటుఫారమును, బ్రాడ్ గేజి ప్లాటుఫారముగా మార్చడం, అదనంగా కొన్ని మార్షలింగ్ మార్గాలు నిర్మించడం, రైలు వాగన్లను పెట్టేందుకు మార్చే ఆవరణచుటూ ప్రహరీ గోడ నిర్మాణం, నీటిసరఫరా అభివృద్ధి, ఆర్. ఎం. ఎస్, పోలీసుసిబ్బందికీ, కలిపి విడిగా ఒక భవనం నిర్మించడం, యిప్పుడున్న ప్రయాణీకుల విశ్రాంతి గదుల అభివృద్ధి, ఫలహారశాలలను బాగు చేయించడం, ప్లాటుఫారముల నుయింకా పొడిగించి, వాటిపై కప్పు వేయించడం.

ఈ పథకం పూర్తి అయి జరిగినప్పుడు సరకులబండ్లు, ప్రయాణీకుల బండ్లు స్టేషనులో వచ్చి ఆగడానికి యింకా ఎక్కువ మార్గాలు నిర్మించబడవుతుంది. ప్రయాణీకుల సౌకర్యాలు కూడా ఎక్కువ అవుతవని శ్రీ హారిస్ చెప్పారు.

## పాక్ సైన్యాలు వాడుతున్న ఆయుధాలు

### అమెరికాతో ప్రస్తావించటం అగౌరవమని శ్రీ నెహ్రూ భావం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: "భారత సరిహద్దులపై పాకిస్తాన్ జరుపుతున్న దాడుల్లో అమెరికా సప్లయి చేస్తున్న సరికొత్త ఆయుధాలను వాడుతున్నట్లు పంజాబ్‌లో భారత సేనాని ప్రకటించారు కదా ఈ విషయాన్ని అమెరికా దృష్టికి తీసుకుని వచ్చారా ?" అని నేడు లోక్ సభలో శ్రీ చోయిత్రాం గిద్వానీ ప్రధాని శ్రీ నెహ్రూను ప్రశ్నించారు.

దానికి ప్రధాని జవాబిస్తూ పంజాబ్ సేనాని సరికొత్త ఆయుధాలు వాడినట్లు ప్రకటించారేకాని, అవి అమెరికాసప్లయి చేసినవని చెప్పలేదనిఅన్నారు. అవి ఎక్కడనుంచి వచ్చినవోకూడా చెప్పలేదని పంజాబ్ సేనాని అన్నట్లు తనకు గుర్తు అని ప్రధాని అన్నారు. పాకిస్తాన్ ప్రభుత్వంకూడా అమెరికన్ ఆయుధాలను వాడటంలేదని చెపుతున్నది కనుక, ఈ పరిస్థితుల్లో అమెరికాను అడగటం అనవసరమనీ, అంతేకాక అది గౌరవప్రదంకూడా కాదని భారత ప్రధాని వివరించారు.

శ్రీ గిద్వానీ: పాకిస్తాన్ ప్రాంతలను బలవంతంగా భారతదేశం ఆక్రమించినప్పుడు తమకు ఇష్టంవచ్చిన సైనికచర్య తీసుకునే అధికారం తమకు వున్నదనీ, దేశరక్షణ విషయంలో పాకిస్తాన్ స్వేచ్ఛకు పాక్-అమెరికన్ ఒప్పందంలో ఇటువంటి హద్దు లేవని పాక్ విదేశాంగమంత్రి శ్రీ హమీదుల్ హక్ చేసిన ప్రకటనను ప్రభుత్వం గమనించిందా ?

శ్రీ నెహ్రూ:- గమనించింది.

### సరిహద్దుల్లో పాక్ సేనల సమీకరణ

శ్రీ సర్దార్ ఇక్బాల్ సింగ్:- పాకిస్తాన్ తన సైన్యాలను సరిహద్దుల్లో సమీకరించిన సంగతి ప్రభుత్వానికి తెలుసా?

### సరిహద్దుల్లోనే మామూలు!

శ్రీ నెహ్రూ:- మామూలుగా పాకిస్తాన్ సైన్యం ఎప్పుడూ సరిహద్దుల దగ్గరే ఉంటుంది. సరిహద్దు సంఘటనలను నివారించాలంటే, సరిహద్దులు కచ్చితంగా నిర్ణయంకానిచోట్ల కచ్చితంగా నిర్ణయించటమే. కొన్ని సంఘటనలు ఈ కారణంవల్ల వచ్చినవే.

మార్చి 9వ తేదీన పాకిస్తాన్ విమానం ఒకటి అమృతసర్ జిల్లా మియానీవాలా గ్రామంమీద ఎగిరిందనీ, ఆ కింద ఒకటి రోజునే అక్కడ ఒక సరిహద్దు దాడి జరిగింది కనుక, బహుశా ఆ విమానం గస్తీకి వచ్చి ఉండవచ్చుననీ ప్రధాని ఇతర ప్రశ్నలకు జవాబిస్తూ తెలియజేశారు.

నిర్మించి ఇవ్వటానికి అంగీకరించగా, బర్మా దానికి బదులుగా కొంత బియ్యాన్ని సప్లయి చేసేందుకు అంగీకరించింది.

## బుద్ధజయంతి

### స్మారక మందిర నిర్మాణం: సన్నాహాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: భారతదేశములో ఆరంభం అవుతున్న బుద్ధజయంతి ఉత్సవాలకు నాందీప్రస్తావనగా ఒక స్మారకమందిర నిర్మాణానికి మే 23న శంకుస్థాపన జరుగుతుంది.

ఈ స్మారక నిర్మాణం ఏ పద్ధతిలో తయారు చేయాలో సూచించవలసిందిగా ప్రపంచంలోని ప్రముఖకళాకారులకు శిల్పులకు ఆహ్వానాలు పంపాయి. అన్నింటిలోనూ ఉత్తమ నమూనాకు బహుమతి లభిస్తుంది.

భారత పురావస్తుశాఖ, ముఖ్యమైన బౌద్ధ కేంద్రాలలో కట్టడాలకు స్తూపాలకు పెద్ద ఎత్తున మరమ్మతుపనులు సాగిస్తున్నారు. అలాంటి ప్రదేశాలకు పోవటానికి బాటలు, విశ్రాంతి మందిరాలు, అవసరమయిన ప్రదేశాలలో నిర్మిస్తున్నారు. పాతనాటిని బాగు చేస్తున్నారు. బుద్ధగయ దేవాలయంవద్ద ఒక ప్రదర్శనశాలనిర్మాణం జరుగుతున్నది. వీటికి అన్నిటికీ మొత్తం రూ 156 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేశారు. దీన్ని కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి.

ఈ ఉత్సవాలలో బౌద్ధకళకు సంబంధించిన ఒక అంతర్జాతీయ ప్రదర్శనం ఏర్పాటవుతుంది.

దేశంలోని ప్రముఖ బౌద్ధమత కేంద్రాలు బుద్ధగయ, సారనాథ్, కుశీనగర్, సాంచీ మొదలైన ప్రదేశాలకు యితర దేశాలనుంచి చాలామంది యాత్రికులు వస్తారని భావిస్తున్నారు.

నవంబర్ మూడవవారంలో బౌద్ధమతంపై ఒక సారస్వత సమావేశం జరుగుతుంది. దీన్ని భారతప్రభుత్వం ఐక్యరాజ్యసమితి సాంస్కృతిక సంఘం, సహాయంతో నిర్వహిస్తుంది ప్రపంచంలోఉన్న ప్రముఖ బౌద్ధపండితులు యిందులో పాల్గొంటారు.

యూరప్, అమెరికా, రష్యా, బౌద్ధదేశాలనుంచి దాదాపు వందమంది ప్రతినిధులు హాజరవుతారు.

ఈ సందర్భంలో లలితకళా అకాడమీ అజంతా చిత్రాలలో ఒక గ్రంథాన్ని ప్రకటిస్తుంది.

రైల్వేలోగు విదేశాలనుంచి వచ్చిన యాత్రికులకు ప్రత్యేక లిరిసెప్ట కనతో తిరుగు ప్రయాణపు టిక్కెట్లను యివ్వటానికి నిశ్చయించింది. వీటిని మే నుంచి డిసెంబర్ వరకు జారీచేస్తారు.

## కాశ్మీరులో జనవాక్య సేకరణ అక్కర్లేదు

1 వ పేజీ 4వ కాలం తరువాయి

జమ్మూలోనూ, పూంఛ్ లోనూ ఏ కేసో జరిగాయని పాక్ ప్రధాని ఏదో చాలా మాట్లాడారు. అంతా అబద్ధాలూ, ఉత్ప్రేక్షలమయం. ఆ వివరాలు ఇప్పుడు చర్చించడం అసంభవం. కాని విషయం ఏమిటంటే నిజానికి కాశ్మీరులో మాత్రం ఎలాటి కలహమూ సంభవించలేదు. ఈ దాడి మూకలు వచ్చినప్పుడు కూడా కాశ్మీరులో ఏమీ జరగనే లేదు. ఈ కుంపులదాడి అక్రమం, అనవసరం. అది దురాక్రమణకాని మరొకటి కాదు.

### ఢిల్లీ యాత్ర!

పాకిస్తాన్‌నుంచి దాడి మూకలు వచ్చిన లారీలపై "కాశ్మీరు మీదుగా ఢిల్లీకి" అని వ్రాసిన విషయం శ్రీ నెహ్రూ గుర్తుకు తెచ్చారు.

పూంఛ్‌లో వన్నులు శల్లించడానికి నిరాకరణకాని, మరి జరిగిన ఏ విషయాలుకాని, ఏమి జరిగినా మహారాజా చేసిందంతా సరైనదేనని సమర్థించడం లేదని శ్రీ నెహ్రూ అన్నారు. కాశ్మీరు మహారాజా బహుశా దోషాలు చేసే ఉంటారు. వారు రాజ్యాధిపత్యంనుంచి తొలగిపోయి నప్పుడు సంతోషించారని శ్రీ నెహ్రూ అన్నారు. కాని అదేదీ పాకిస్తాన్ చేతలను సమర్థించవు.

### ఎలా తెలియకుండా ఉంటుంది!

మొదటేమో కాశ్మీరులో ఏం జరిగిందో తెలియదన్నారు. పాకిస్తాను మీదుగా దాడిమూకలు వచ్చినప్పుడు తెలియకుండా ఉంటుంది?

"తరవాత చేసిన దానిని ఎక్కడో జునాగఢ్‌లోనో మరొకచోటనో ఏదో జరిగిందంటూ సమర్థించుకోవాలని చూశారు. దానికీ కాశ్మీరుకీ పీసం సంబంధం లేదు.

సంఘ కార్యాలసంగతి తెచ్చారు. అవును పాకిస్తాన్‌లో సంఘ కార్యాలు జరిగినమాట నిజమే. భారతదేశంలోనూ అక్కడక్కడ జరిగినవి. అది చాలా దారుణమే. కాని అకారణంగా కాశ్మీరుపై దురాక్రమణకీ దానికి సంబంధం ఏమిటి?

చాలా సరళమైన అంశాన్ని గురించి ప్రజల మనస్సులలో అయోమయం సృష్టించడానికి ఇదే తార్కాణం అని శ్రీ నెహ్రూ అన్నారు. పాకిస్తాను మొదటినుంచీ ఇదేపద్ధతి అవలంబిస్తోంది.

### జఫ్రుల్లా అబద్ధాలు

ఐక్యరాజ్యసమితిలో పాక్ ప్రతినిధి శ్రీ జఫ్రుల్లా ఖాన్ పాకిస్తాన్ వాదాన్ని ఆరంభించడంలోనే అనేక అబద్ధాలతో ఆరంభించారు. "అవి అబద్ధాలని పార్లమెంటులో అన్నాను. కావలిస్తే మళ్లీ అంటాను" అన్నారు శ్రీ నెహ్రూ.

### శ్రీనగర్ ప్రజలే నిరోధించారు

మొదట కాశ్మీరుపై దురాక్రమణ జరిగినప్పుడు భారతసైనికుడు ఒక్కడు కూడా కాశ్మీరులో లేడు. దాడిజరిగిన చాల రోజులవరకూ వెళ్లనేలేదు. కాశ్మీరులోయ అంతా ఎవరు దాడిచేసినా దిక్కులేకుండా వుంది. శ్రీనగర్‌ని శ్రీనగర్ ప్రజలే రక్షించుకోవాలి. కేవలం వలంటీర్లు. అవి చాలా చిత్రమైన రోజులు. సామాన్య ప్రజానీకం విప్లవావేశంలో ఎంతటి ప్రమాదాలనూ లక్ష్యం చెయ్యకుండా నిలిచారు. తమ నగరాన్ని, సుందరమయిన తమ లోయనీ కాపాడుకోడానికి శ్రీనగర్ ప్రజలు, కాశ్మీర్ ప్రజలూ ప్రాణాలొడ్డి నిలిచారు. కాని ఎంతకాలం అలా నిలవగలరు? కొన్ని రోజులు మాత్రం నిలవగలిగారు. వారి క్రోధం, దాడిపట్ల వారి రోషం ఆ నాదిరోజుల్లోనూ కనపడింది. ఈయథార్థాన్ని అందరూ గుర్తుంచుకోవాలని శ్రీ నెహ్రూ అన్నారు.

### ఎనిమిదేళ్ల చరిత్ర

ఎనిమిదేళ్ల చరిత్రని ఎవరూ మరిచిపోలేరు. ఏడాది తరవాత ఏడాదిగా పాకిస్తాన్‌లో ఈ సమస్య పరిష్కారమౌతుందనే ఆశతో నిరీక్షించారని శ్రీ నెహ్రూ అన్నారు. పాకిస్తాన్‌తో స్నేహ భావంతో పరిష్కరించాలని ప్రయత్నించారు. కాని ఏదీ ఫలించలేదు. చివరికి అక్కడ ఎన్నికలు సాగనివ్వాలని వచ్చింది, శాసనసభ ఏర్పడింది. అది కాశ్మీరు రాజ్యాంగాన్ని తయారుచేస్తోంది.

పరిస్థితులు మారిపోయాయి. ఇటువైపునే కాదు, అటువైపుకూడా మారిపోయాయి. ఈ ఎనిమిదేళ్లలో జరిగిందంతా మరిచిపోవడం అసంభవం. వీనిని లెక్కలోకి తీసుకోక తప్పదు. రాజ్యాంగపరిణామాలు వాస్తవ స్థితిగతులలో మార్పులు ఇవన్నీ లెక్కలోకి తీసుకోక తప్పదు. అందువల్లనే కాశ్మీరులోయ గురించి శ్రీ బుల్గానిన్, శ్రీ కృశ్చేవ్‌లు చేసిన ప్రకటన న్యాయశాస్త్ర రీత్యా, రాజ్యాంగరీత్యా వాస్తవ విషయాలనుబట్టి కూడా పూర్తిగా నిజం అని చెప్పాలి అని శ్రీ నెహ్రూ అన్నారు.

### న్యాయపరిశీలనకు సిద్ధమే

న్యాయశాస్త్రం ప్రకారం రాజ్యాంగం ప్రకారం నాతో వాదించాలనుకుంటే, ఆదినుంచీ అన్ని విషయాలనూ పరిశీలించడానికి నేను సిద్ధమే. అప్పుడు

దురాక్రమణ నేరాన్ని ఒప్పుకోవాలి. కాశ్మీరు భారతదేశంలో చేరిపోయినట్లు ఒప్పుకోవాలి. కళ్లు తెరచి యథార్థాలను గుర్తించడానికి నిరాకరించేవారు తప్ప అందరూ చేరిన విషయం ఒప్పుకున్నారు.

### మానవ న్యాయం

"మనుష్యులకు, దేశాలమధ్య వ్యవహారాలకు సంబంధించినప్పుడు, క్లిష్ట న్యాయసూత్రాలను అంటిపెట్టుకోడం సా కోరిక కాదు. వాస్తవ పరిస్థితుల్నిబట్టి మనం పరిశీలించవచ్చు. అన్నిటినీ మించి కాశ్మీరు ప్రజల సుఖ స్వాతంత్ర్యాలే మనకు కావలసింది. ఘనీభవించిన న్యాయసూత్రాలు, రాజ్యాంగ నియమాల అంతరార్థాల కంటె అదే ముఖ్యం.

"కాని న్యాయశాస్త్రమే కావాలని పట్టుబట్టినట్లయితే న్యాయమూ మన పక్షానఉంది. దురాక్రమణ చేసినవారిది దోషం. న్యాయం ఏమిటంటే కాశ్మీరు భారతదేశంలో చేరిపోయింది. కాశ్మీరు భారతదేశాంతర్భాగం." అని శ్రీ నెహ్రూ అన్నారు.

### ఆయుధసహాయం వచ్చిన ఫలితమా!

ప్రశ్న : పాకిస్తాన్ సేనలు ఉపసంహరించాలనేది, పాకిస్తాన్‌కి (అమెరికా) ఆయుధసహాయంలభించకముందే కదా, ఆ సహాయం రావడంతో పరిస్థితి మారిపోయిందంటున్నారు. ఇప్పుడు పాకిస్తాన్ సేనల్ని ఉపసంహరిస్తే సరిపోతుందా ? ఆయుధసహాయంవల్ల వచ్చిన తేడా ఏమిటి ?

శ్రీ నెహ్రూ : పాకిస్తాన్‌తో చర్చలు సాగిన ఇంతకాలమూ జనవాక్య సేకరణ జరిపే ముందు జరగవలసిన తతంగం గురించే, అందులో అనేక విషయాలున్నాయి. మొదటిది పాక్ సేనల ఉపసంహరణ: అది ఎంతకీ పరిష్కారం కానేలేదు. అది పరిష్కారము అయింటే, తరువాత పరిష్కరించవలసిన ముఖ్యసమస్యలింకా ఉన్నాయి. ఇంకా మొదటి సమస్య తేలకముందే ఆయుధసహాయంవచ్చి పరిస్థితినంతా మార్చేసింది. కాశ్మీరు రక్షణ దృష్ట్యా చూసినా, సైనిక రాజకీయ పరిస్థితులదృష్ట్యా చూసినా పరిస్థితులు మారిపోయినాయి.

"ఇప్పుడు పాకిస్తాను ఎంతబలం ఉపసంహరించాలి ఈ మొదలైన విషయం లెక్కలోకివచ్చేదికాదు. వెనుక అపారంగా పెరిగిన సైనికబలం ఇప్పుడుంది. దీనివల్ల వచ్చేతేడాకూడా చాలా అధికమే.

"రెండో సంగతి: భారతదేశ రక్షణ దృష్ట్యా ఇదొక పెద్దవిషయంగా పరిణమిస్తుంది. ఇవన్నీ ఆలోచించవలసినవే.

"భారతదేశంచుట్టూ పెద్దపెద్ద సైనిక స్థావరాలు—నాకు తెలిసినంతవరకూ పాక్ ఆక్రమిత కాశ్మీరులోకూడా ఈ స్థావరాలున్నాయి-వీటివల్ల పరిస్థితి పూర్తిగా మారిపోయింది, అసలు సమస్య స్వరూపమే మారిపోయింది."

ఒక పాకిస్తానీ విలేఖరి ఇలా ప్రశ్నించారు : "కాశ్మీరులో అసలు జనవాక్య సేకరణకే మీకు ఇష్టంలేదని ఒక అర్థం తీస్తున్నారు. అది నిజమేనంటారా ?"

శ్రీ నెహ్రూ : చాలవరకు అంతే విషయం స్పష్టపరుస్తాను. ఈ జనవాక్యసేకరణ సమస్యని ఆ ఏడుసంవత్సరాలు అనేకసార్లు చర్చించాం. కాని ముందు జరగవలసినపని జరగనేలేదు. ఈలోగా పరిస్థితులు కొన్ని మారాయి-అంటే అమెరికా ఆయుధ సహాయం మొదలైనవి. వీనివల్ల ఆ సమస్య మరింత క్లిష్టమైపోయింది.

### ఎంతవాదించినా లాభంలేదు

"ఈ సమస్యపై ఇంక చర్చించడం నాకు ఇష్టంలేదని అర్థంకాదు. కాని కార్యవాదిగా నా అభిప్రాయం ఏమిటంటే—ఇది ఎంత వాదించినా తిరిగి తిరిగి చివరికి ఒకే మొండి వాదానికి దిగుతోంది. అందువల్ల దీనిని మరొక దృష్టితో, ఉన్న కొత్తపరిస్థితులను లెక్కలోకి తీసుకుని రాజీకి ప్రయత్నించాలంటాను.

"కొద్దివారాల్లో త్వరలోనే కాశ్మీరు రాజ్యాంగ రచన పూర్తవుతుంది. కొత్త రాజ్యాంగం ప్రకారం త్వరలోనే అక్కడ ఎన్నికలు కూడా జరుగుతాయి" అని శ్రీ నెహ్రూ అన్నారు.

## పాటియాలా రాజధాని కావాలని శిఖ్ఖుల కోర్కె

అమృతసర్, ఏప్రిల్ 1: శిరోమణి అకాలీదళ కార్యవర్గం, శిరోమణి గురుద్వార ప్రబంధకసంఘం, సంయుక్తంగా సమావేశమై, పంజాబురాష్ట్ర రాజధానిని పాటియాలలో ఏర్పాటు చేయాలని కోరుతూ తీర్మానించారు.

కొత్తరాష్ట్రం నియోజకవర్గాల పునర్విభజన సంఘంలోనూ, ఉద్యోగాల విషయం నిర్ణయించే సంఘంలో సిక్కులకు ప్రాతినిధ్యం యివ్వాలని కూడా తీర్మానం చేశారు.

### సామూహిక నిరశన దీక్ష

మహా పంజాబ్ రాష్ట్రాభిలాషులు కొందరు స్త్రీలు సహా నాబలరాంజీ నాన్‌టాంటన్ నాగిస్తున్న నిరాహార దీక్షపట్ల సానుభూతి సూచకంగా ఒక రోజు ఉపవాసంచేశారు. ఈ ఉపవాస వ్రతంలో 400 మంది పాల్గొన్నట్లు మహాపంజాబువర్గాలద్వారా తెలిసింది.

## బుడమేరు పథకం: శ్రీ కాకాని హెచ్చరిక

1 వ పేజీ 8వ కాలం తరువాయి

దించిన ఇంజనీర్లకు కృష్ణా ఆనకట్ట ప్రమాదానికి కారకుడైన ప్రధాన ఇంజనీర్ కి ఉన్నంత అనుభవం లేక పోవచ్చు ఏ ఇంజనీరు చెప్పినా వినాలని పబ్లిక్ వర్క్సుమంత్రి వాదిన వాస్తవమే. అయితే ఏ ఇంజనీరు అయినా సరే లవేక వంతెంగా, నిష్పాక్షికంగా, దూర దృష్టితో చేసే సూచనలను మాత్రమే వినాలి."

"ఇది గిట్టుబాటైన పథకం కాదని, పనికిరాదని మాజీ చీఫ్ ఇంజనీరు ఒకరు తీర్మానించారు. సమష్టి మద్రాసు రాష్ట్రం నాటి మాట ఇది. ఆయన ప్రాసిన వ్రాతలను ఇప్పటి ప్రధాన ఇంజనీరు, కేంద్ర ఇంజనీర్లు తుడిచివేసి బుడమేరు పథకం-రిజర్వాయరు నిర్మాణపథకం, కరకట్టలు, మళ్లింపు పథకం అవసరమన్నారు. ఈ పనులకు డబ్బు ఇస్తామని కేంద్ర ప్రభుత్వం అన్నారు"

"రిజర్వాయరు ఇక వస్తుంది అనిఅనుకున్నారు ప్రజలు. కాని రాజకీయాలు, ప్రాంతీయాభిమానాలు దీనికి అడ్డుపడతవని ప్రజలు అనుకోలేదు. మా మాట వినకపైనా వినాలి మాకు నచ్చచెప్పకైనా చెప్పాలి అని అంటున్నారు మంత్రి".

"వారు చెప్పేమాట ప్రజలు వింటునే ఉన్నారు. కాని, వారికి నచ్చచెప్పడం ప్రయత్నంకూడా తరంకాదు. అందుకు వారు రోజూచేసే ప్రకటన లేనిదర్శనం-సాక్ష్యం. పూర్వాభిప్రాయనిర్ణయాలు లేని మనసుగల మంత్రికి నచ్చ చెప్పవచ్చుగాని, ఇదివరకే తీర్మానం చేసుకుని, దాన్ని రోజూ పునశ్చరణచేస్తూ, 'చెప్పండి-వింటాం' అనే వారి మాట లాభంలేదు".

"వారికి ఎవరు నచ్చచెప్పాలి? ఎవరు నచ్చచెప్పగలరూ వినదలుచుకోనప్పుడు వరద నిరోధక పనుల మండలి సమావేశంలో మొదట ఎట్లాగో ఆయనకూడా అంగీకరించారు. మళ్లీ ఎందుకు మార్చుకోవలసి వచ్చింది? నిజంగా ఇంకొకరు చెప్పేమాటలను వినే స్థితిలో ఉన్నారని వారు గుండెపై చెయ్యివేసుకుని చెప్పేమాటలేనా ఇవి? లేక అమాయిక ప్రజలను దబాయించడానికా?"

### మంత్రి మాటలు

"వరదనిరోధక పథకాలకు. కేంద్ర ప్రభుత్వం ఇంతమొత్తం ఇచ్చింది—బుడమేరు పథకాన్ని ప్రారంభిస్తాం. అయితే అభివృద్ధిపన్ను ఎట్లావెయ్యాలని ఆలోచిస్తున్నామని అన్నారొకసారి ఒక ప్రకటనలో మంత్రి.అభివృద్ధిచెందిన ప్రాంతాలనే ఇంకా బాగుచేస్తే మరి వెనుకపడిన ప్రాంతాలను బాగుచెయ్యడం ఎప్పుడు అన్నారు మరొక ప్రకటనలో మంత్రి."

### వెనకపడిన ప్రాంతంలో వరదలు వస్తాయా?

"రాయలసీమను బాగుచేయించి కరువునివారణ పనులను చేయించడానికి ఎవరికీ ఆక్షేపణలేదు. వరద నిరోధక పథకాలకు ఇచ్చిన డబ్బు వెనుకపడిన ప్రాంతాలకు వినియోగించుకొమ్మంటే వెనుకపడిన ప్రాంతాల్లో వరదలు ఎక్కడినుంచి వస్తవి? ఆయా ప్రకటనల వల్ల రోజుకొకమాట, రోజుకొక నిర్ణయంగా మీరు వ్యవహరిస్తున్నారని విశదమవుతోంది. ప్రాంతీయ వాదులను ఒక ప్రాంతంపై రాగద్వేషాలను దాటి వారి వైఖరి ముందుకు పోలేదనడానికి బుడమేరు రిజర్వాయర్, నిర్మాణపథకం విరమణ పెద్ద తార్కాణం."

### మంత్రికి ధైర్యం అవసరం

"బుడమేరు కృష్ణాజిల్లాలో ఉన్నది కనుక ఈ పని చెయ్యను అని పబ్లిక్ వర్క్సు మంత్రి ధైర్యంగా చెబితే ప్రజలు సంతోషిస్తారు. సాంకేతికకారణాలను ఏ కరువు పెట్టడం సబబుకాదు. సాంకేతిక ప్రవీణులు ఆమోదించారు. వరద నిరోధకపనుల కేంద్రమండలి, దాని ప్రధాన ఇంజనీరు ఆమోదించారు. ఇది ప్రతిష్ఠకు సంబంధించిన సమస్యగా పబ్లిక్ వర్క్సు మంత్రికి తయారైంది,"

### ఉద్యోగులకు ధైర్యం పోతుంది

"మంత్రి ఇంత వీరావేశంతో మాట్లాడుతున్నప్పుడు వచ్చే ఎనిమిదో తేదీన జరిగే సమావేశంలో సాంకేతిక ఉద్యోగులు కూడా ధైర్యంగా మాట్లాడగలరనే నమ్మకం ప్రజలకు ఎక్కడినుంచి వస్తుంది ?"

"ముఖ్యమంత్రి, తదితర మంత్రులకు గురుతర బాధ్యత ఉంటుంది. రాగద్వేషరహితంగా పరిపాలన నిర్వహిస్తామని వీరందరు ప్రమాణస్వీకారం చేశారు.

ఒక ప్రాంతప్రజలకు బుద్ధిపూర్వకంగా అన్యాయంచెయ్యాలని ఒక వ్యక్తి తలపెట్టిన సందర్భమిది. న్యాయపర్యాలను మంత్రులు సద్దించాలి, అంతగా మంత్రులకేమైనా సందేహముంటే కేంద్రప్రభుత్వానికి వ్రాసి తెలుసుకోవచ్చు."

### హాస్యాస్పదం

"అభివృద్ధిపన్ను ఇవ్వవలసివస్తుందని మా భూమి మునగడం లేదంటే, మా భూమి మునగడం లేదని రైతులు అన్నారట !! ఈ మాటలను మంత్రి నమ్మారా ?? ఇంతకంటే హాస్యాస్పదమైన సందర్భం మరొకటిలేదు. 1949 లో బుడమేరుకు వరదలువచ్చి, వీరు ప్రళయ తాండవం చేసినప్పుడు ఎన్ని జీవరాశుల ప్రాణాలు గోల్పోయినదీ, ఎంత పంట నష్టమైనదీ కన్నులారచూచి కంట నీరు పెట్టారు."

"ఈ పథకం విషయం ఆలోచిస్తున్నామని చెప్పడం రాజకీయ చతురతకు నిదర్శనంకాదు. నిన్నకాక మొన్న ఎగ్రకాలవకు వరద వస్తే ఇదుగో పరిశీలన చేస్తున్నాం-ఆదుగో చేస్తున్నాం-అంటారు."

### ప్రభుత్వపు రికార్డులు వరదపాలైనాయా?

"వరదవస్తే బాధ తెలుస్తుంది. భగవంతుడి దయవల్ల అటువంటి బాధ రాకుండా ఉండాలి ! వచ్చినప్పుడు దాన్ని ఎదుర్కొనడానికి శాయశక్తులా కృషి చెయ్యాలి. తమపొలాలు మునగలేదని రైతులుఅన్నారనటం రాజకీయం. ఎవరి పొలం మునుగుతుందో రైతులు మంత్రికి చెప్ప నవసరంలేదు. ప్రభుత్వ రికార్డులేమీ వరదలో కొట్టుకు పోలేదు కదా ?? గత దెబ్బయి సంవత్సరాలలో ఏడెనిమిదిసార్లు వరద రాగా ఎంతపంట నష్టమైనదీ వివరించే నివేదికలు ప్రభుత్వంవద్ద ఉంటే తప్పా.? లేదా తెప్పించామంటే తెప్పించామనడానికి ఏదో నామమాత్రమైన నివేదిక తెప్పించి ఈ మాయ తలపెట్టి ఉండాలి."

### మాజీ చీఫ్ ఇంజనీరు : ఉపముఖ్యమంత్రి

"బుడమేరు కాలువ ఎక్కువ చేసినందువల్ల, లోతు ఇంకా ఎక్కువ చేస్తేను రు. 1 కోటి ప్రణాళికవల్ల వచ్చే ప్రయోజనాలు కలగబోవు. ఆనకట్ట ఎత్తు ఎక్కువ చేసినా అప్రయోజనం సిద్ధించదు. ఇంజనీర్లను సంప్రదించే యీ మాటలు అంటున్నాం. ఇవన్నీ కేవలం కన్నీళ్ళు తుడుపుమాటలు. దీన్ని నీటి వనరు ప్రాశస్త్యగా పబ్లిక్ వర్క్సు మంత్రి, మాజీ చీఫ్ ఇంజనీరు తప్ప మరెవరూ అనుకోలేదు."

### అంకెల గారడీ

"రిజర్వాయర్ లో నీరు ఉన్నదిగదా రైతులు అడిగితే 8 వేల ఎకరాలకు రెండవ పంటకు నీరు సప్లయిచేయవచ్చునన్నది ఇంజనీర్లు మాటవరసకు చెప్పినది. అదే ప్రధానమైన పథకంగా చిత్రించడం నరుబాటు. ఎకరానికి 4 వేల 5 వందలు అవుతుంది, గిట్టుబాటు కాదు అని చెప్పడం అంకెల గారడీ"

"కోసీ, బ్రహ్మపుత్ర నదులకు వరద నిరోధక పనులు చేయించినప్పుడు అది గిట్టుపనులా-కాదా అని చూచారా? రిజర్వాయర్ నిర్మాణం పని విరమించి కాల్వలోతు, వెడల్పు లను యెక్కువచేయించడం క్షేమం కాదు. వెడల్పు యెక్కువ చేయిస్తే కృష్ణలో ఇసుక మేటలను త్రవ్వించడానికి ఇప్పటికంటె ఎక్కువ ఖర్చు చేయ వలసి వస్తుంది. రిజర్వాయర్ పథకాన్ని తయారుచేసిన రాష్ట్ర ఇంజనీర్లుగాని, దాన్ని ఆమోదించిన కేంద్ర ఇంజనీర్లు గాని అజ్ఞానులు కారు. మాయ మాటలతో ప్రజల నెవరూ వంచించలేరు. ఇందులోని సబబును కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు గమనించి అన్యాయం జరగకుండా తగు ఏర్పాట్లు చేయిస్తారని ఆశిస్తున్నాను."

## బొంబాయిలో ఆందోళన

### పాతికమంది అరెస్టు

బొంబాయి, ఏప్రిల్ 2: ప్లోరా ఫౌంటెన్ ప్రాంతంలో పాతిక మంది సంయుక్త మహారాష్ట్ర సత్యాగ్రహులను పోలీసులు అరెస్టుచేశారు.

బొంబాయిరాష్ట్ర శాసనసభ వాయిదా పడినందున, మూడు రోజుల క్రితం ఆగిపోయిన సత్యాగ్రహం మళ్లీ ప్రారంభమైంది. ఫ్లోరాఫౌంటెన్ ఇవాళ ప్రాంతంసత్యాగ్రహంలో20మంది మహిళలుకూడాపాల్గొన్నారు.

# ఆంధ్ర తెలంగాణా నాయకుల సమావేశం

## అన్ని సమస్యలూ తేలుతవి అని ముఖ్యమంత్రి ప్రకటన

కర్నూలు, ఏప్రిల్ 2: "ఇంకా తేలవలసిన విషయాలను, రేపు తెలంగాణా నాయకులతో చర్చించి తేల్చుకొని, ఎల్లుండి-అంటే 4 వ తేదీన తెలంగాణా విలీనానికి సంబంధించిన నిర్ణయాన్ని శాసనసభలో ప్రకటిస్తాము." అని ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి శాసనసభలో రాష్ట్రాల పునర్నిర్మాణం బిల్లును ప్రతిపాదిస్తూ చెప్పారు.

ఆంధ్ర తెలంగాణా రాష్ట్రం అని పిలవడం బాగుండలేదని తెలంగాణా నాయకులు గూడా ఒప్పుకున్నారు. ఆంధ్ర శాసనసభలోని అన్ని పక్షాల నాయకులు, 'ఆంధ్ర ప్రదేశ్' అనే పేరు పెట్టాలని సూచించారు గాబట్టి తెలంగాణా నాయకులు యీ పేరును అంగీకరిస్తారు అనికూడా ముఖ్యమంత్రి తెలియజేశారు.

"గుంటూరులో హైకోర్టు శాఖ ఉండాలనే ప్రతిపాదనకు చాలా వ్యతిరేకత కల్పిస్తున్నది. ఈ విషయమై, తెలంగాణా నాయకులు పట్టుబట్టరని ఆశిస్తున్నా. ఆంధ్ర న్యాయవాదులు హైదరాబాదులోని న్యాయవాదులకన్నా తక్కువ రుసుం పుచ్చుకొని పని చేస్తారనే ఊహ కేవలం అపోహ; దానికి ఆధారమేమీ లేదు" అని ముఖ్యమంత్రి అన్నారు.

ఒక రాష్ట్రం నుంచి ఇంకో రాష్ట్రానికి బదిలీ చేసిన ఉద్యోగులకు అదనపు జీతం ఇవ్వవలసిన అవసరం లేదని, ఇటీవలి ముఖ్యమంత్రుల సమావేశంలో అంగీకరించడమైనదని, వక్కాణించారు.

ఎన్నికల విషయం ప్రస్తావిస్తూ, కొత్త రాష్ట్రానికి 1960 లోనే ఎన్నికలు జరపాలనే సూచనకు కేంద్రప్రభుత్వం ఆమోదించగలదని తెలంగాణా నాయకులు గూడా, 1957 లో ఆంధ్ర తెలంగాణాలు రెండు ప్రాంతాలలో ఎన్నికలు జరపాలని పట్టుబట్టరని ఆశిస్తున్నానని అన్నారు.

"రేపటి చర్చలలో, కొత్త రాష్ట్రానికి ఎగువ శాసనసభ ఉండాలా అక్కరలేదా అనే విషయం తేలిపోతుంది" అని ముఖ్యమంత్రి తెలియజేశారు.

ఆంధ్రప్రభుత్వం యావత్తూ యిప్పుడే కర్నూలు మార్చవలసిన అవసరం లేకపోయినా, కేంద్ర ప్రభుత్వ ఆదేశం ప్రకారం సాధ్యమైనంత త్వరగా, ప్రభుత్వం హైదరాబాదునుండి పని చేసేటందుకు ప్రాథమిక చర్యలు కొన్ని తీసుకోవడమైందని చెప్పారు.

సరిహద్దుల విషయం చెబుతూ, ఆంధ్ర రాష్ట్ర దక్షిణ ఉత్తర సరిహద్దుల నిర్ణయానికి వెంటనే సరిహద్దుసంఘం నియమించాలని ముఖ్యమంత్రి కోరారు.

ఇవాళ ఆంధ్ర శాసనసభలో రాష్ట్రాల పునర్నిర్మాణ బిల్లుపై చర్చ ప్రారంభమైంది. ప్రశ్నోత్తరాల సమయం కాగానే, ముఖ్యమంత్రి రెండు ప్రతిపాదనలు చేశారు.

మొదటి ప్రతిపాదన:

"రాష్ట్ర నిర్మాణం బిల్లును పార్లమెంటులో, ప్రతిపాదించడానికి, యీ సభ సిఫార్సు చేస్తున్నది."

రెండవ ప్రతిపాదన:

"రాష్ట్ర పునర్నిర్మాణం బిల్లును పరిశీలనలోకి తీసుకోవాలి."

వీటిని ప్రతిపాదిస్తూ, ముఖ్యమంత్రి యిలా ప్రసంగించారు: "ఈ రెంటిని ఒక పరచి ప్రతిపాదిస్తున్నాను. ఓటింగ్ వేరు వేరుగా తీసుకోవచ్చు. మొదటి రెండు మూడు రోజులు సాధారణ చర్చ జరుగుతుంది. క్లాజు వారీ చర్చ వచ్చినప్పుడు సవరణలు యిచ్చి మాట్లాడుకోవచ్చును. రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం నివేదికను, యీ సభలో నవంబరు 21, 25, 26 తేదీలలో చర్చించారు. ఆనాటి పరిస్థితులకు యీనాటి పరిస్థితులకు చాలా తేడా ఉన్నది. ఆనాడు బళ్ళారిలోని మూడు తాలూకాలు మనకు వస్తాయి అని ఆశించాము. హైదరాబాదులోని, తెలంగాణా ప్రాంతం ఐదు సంవత్సరాలవరకు ప్రత్యేకంగా ఉంటుందనే మేము అనుకొన్నాము. ఈ రెంటిమీద భారత ప్రభుత్వపు నిర్ణయాలు వచ్చేశాయి. బళ్లారి తాలూకాలు మూడు మనకు రావటంలేదు. మైసూరులోనే ఉండిపోతున్నవి. తుంగభద్ర ఎగువకాల్వ విషయంలో సదుపాయాలు కలుగచేసుకోవచ్చునని వివరించి అలా నిర్ణయించారు. తెలంగాణా విషయంలో నాయకుల మధ్య రాజీకుదిరింది. కనుక, తొమ్మిది జిల్లాల ఆరు తాలూకాలు అక్టోబరు 1 నుంచి ఆంధ్రరాష్ట్రంలో కలవాలి అని సూచించారు."

"రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం సిఫార్సులలో, ఏమీ మార్పులు జరుగవని అనుకొన్నాము ముందు. కాని మనకు సంబంధించిన రెండు విషయాలలో మార్పులు జరిగినవి. అయితే ఒకటి వ్యతిరేకంగా అయింది మరొకటి అనుకూలంగా అయింది."

"శాసనసభ చర్చ జరిగిన తరువాత ప్రజాభిప్రాయం ప్రకారం తెలంగాణా ఆంధ్ర రాష్ట్రానికి చేర్చడం జరిగింది. బళ్లారి విషయంలో ఆశాభంగం కలిగింది. ఇప్పుడు యీ బిల్లులో ప్రారంభంలోనే, మూడవ సెక్షన్‌లో ఆంధ్ర సంగతి చెప్పారు. నిర్ణీత తేదీ నుంచీ హైదరాబాదు, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగరం, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ, మహబూబ్‌నగరం, జిల్లాలతోను, రాయచూర్ జిల్లాకు చెందిన కొడంగల్, తాండూరు తాలూకాలను, బీదర్ జిల్లాలోని నారాయణ్‌ఖేడ్, జహీరాబాద్ తాలూకాలను, ఆంధ్ర రాష్ట్రంలో చేర్చాలని నిర్ణయించారు. ఇది చారిత్రాత్మకమైన నిర్ణయం. అసలు ఈ తొమ్మిది జిల్లాలు ఆంధ్ర రాష్ట్రంలో కలవాలి అని చెప్పడంలోనే ఒక విశేషం ఉన్నది. సాంస్కృతికంగా కలిసొట్లుగా విడిగా ఉన్న ప్రజలు అందరూ, ఒక శాసనం క్రిందకు, రావడం తెలుగువారికి చిరస్మరణీయమయిన విషయం. చట్టం మన రాష్ట్రంతోనే ప్రారంభం కావడం శుభసూచకం."

"నిర్ణయం జరిగిన తరువాత, వ్యతిరేకత, ఉన్నట్లు కనపడటం లేదు. ఆందోళన లేదు. అది రానున్న రాష్ట్ర భవిష్యత్తుకు శుభసూచకం. ఇబ్బందులు ఉండినను, ధైర్యం చెప్పవచ్చు. ప్రత్యేక రాష్ట్రం కావాలన్న నాయకులు కూడా సుహృద్భావంతో, అనుమానాలు తొలగించుకొని, న్యాయం జరుగుతుంది అనే ధైర్యంతో తమ ప్రజలకు నచ్చచెబుతూ ప్రచారం చేస్తున్నందుకు చాల సంతోషంగా ఉంది."

"ఇంకా చర్చించుకోవలసిన విషయాలు చర్చించి తేల్చుకొనడానికి రేపు శ్రీ రంగారెడ్డి, శ్రీ చెన్నారెడ్డి, శ్రీ నరసింగరావు గారలు వస్తున్నారు. వారితో చర్చించిన మీదట జరిగిన నిర్ణయములు, నాలుగవ తేదీన సభకు చెప్పడానికి అవకాశం ఉంటుంది. సూచించదలచిన సవరణలు ఉభయులు ఏకగ్రీవంగా, సూచించడానికి వీలుంటుంది. బిల్లులో కొత్తగా వచ్చే కేరళ మైసూరు రాష్ట్రాల పునర్నిర్మాణం తరువాత ఏర్పడే కేరళ, మైసూరు మధ్యప్రదేశ్ లాంటి వాటిని ఆంధ్ర మద్రాసు రాష్ట్రాలను, మాత్రం పాతవిగానే పేర్కొన్నారు. దాని ఉద్దేశ్యం నాకు బోధపడటం లేదు."

"నాకు తెలిసినంతవరకూ, హైదరాబాదులోనూ, యిక్కడ కూడా ప్రాతినిధ్యం సమానంగా ఉండడం వల్ల తేడా ఉండవచ్చు అని లేదా ఎక్కువ భాగం యిక్కడ ఉండి కొద్దిభాగం యిక్కడ కలుస్తున్నదని అట్లా అని ఉంటారు అని నా ఊహ. అందరికి సంతృప్తిగా ఉంటుందనే భావంతో, ఆంధ్ర తెలంగాణ అని యీ రాష్ట్రానికి పేరు పెట్టారు. తిరువాన్కూరు కొచ్చిన్ ఉండదంటే అది వేరు. దానికి దీనికి సంబంధం లేదు. ఆంధ్రప్రదేశ్ అని పేరు పెట్టాలనే విషయంలో భేదం ఉండవచ్చు కాని, యీ పేరు బాగా లేదనే విషయంలో మాత్రం భేదాభిప్రాయం లేదు."

"కొత్త రాష్ట్రానికి ఆంధ్ర ప్రదేశ్ అని పేరుపెడితే బాగుంటుందని నా అభిప్రాయం. రేపటి చర్చలలో యీ విషయం మాట్లాడుకోవచ్చు."

ప్రాంతీయ మండలుల విషయం ప్రస్తావిస్తూ, యీ మండలి యేర్పాటు వల్ల, మెట్టూరు విద్యుత్కేంద్రం నుంచి మైసూరులోని జోగ్ విద్యుత్కేంద్రంనుంచి, ఒరిస్సాలోని మాచ్‌ఖండ్ నుంచి మనం విద్యుచ్ఛక్తి తెప్పించుకోవడానికి, చాలా సహాయం కోరి కొనగలదని; వంశధార విషయములో ఒరిస్సాతోనూ, తుంగభద్ర ఎగువ కాల్వ విషయంలో మైసూరుతోనూ, ఆదిలియార్ ప్రాజెక్టు విషయములో, మద్రాసుతోనూ, ఒడంబడిక కుదుర్చుకోవడానికి, ఈ ప్రాంతీయ మండలి ఎంతైనా ఉపయోగపడుతుందని ముఖ్యమంత్రి అన్నారు.

తెలంగాణాకు ప్రాంతీయ సంఘం ఏర్పాటుచేయడం గురించి చెబుతూ, ఈ సంఘాన్ని ఏర్పాటు చేయడంవల్ల ఆంధ్రకు వచ్చేనష్టమేమీ లేదని, 5 లేక 10 ఏళ్లలో తెలంగాణా ప్రజలభయాలు తీరిపోగలవని తన నమ్మకమని గోపాలరెడ్డి అన్నారు. ఒక గడువు నిర్ణయించి ఆ గడువు తీరిపోగానే, ప్రాంతీయ సంఘాన్ని రద్దు చేసివేసుకొనడానికి తెలంగాణా నాయకులు యిప్పుడే అంగీకరిస్తే సంతోషిస్తాను. వారు అందుకు ఒప్పుకోకపోయినా బిల్లులో, యిప్పుడే ఒక సవరణ తేవచ్చు" అని శ్రీ గోపాలరెడ్డి అన్నారు.



ఢిల్లీలో జరుగుతున్న జాతీయ రైతులగోష్ఠికి వచ్చిన ప్రతినిధులు, [illegible]

ఒకయవాడిలో (ప్రభుత్వ ఆసుపత్రి నూతన భవనానికి ఆరోగ్యమంత్రి శ్రీ వెంకటరావు మార్చి 28 న శంకుస్థాపన చేశారు.

# గ్రామాల సమగ్ర అభివృద్ధి

## రైతుల గోష్ఠిలో శ్రీ పంత్ ప్రసంగం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 1: "గ్రామాలలోని ప్రజలు సుఖశాంతులతో హాయిగా ప్రశాంతంగా నివసించడానికి అవసరమైన అవకాశాలను పెంపొందించేందు కనుగుణంగా గ్రామాల పునర్నిర్మాణానికి శాయశక్తులా కృషి చేయాల్సి" అని అఖిల భారత వ్యవసాయదారుల పరిషత్ ఆధ్వర్యాన "భారత దేశంలో గ్రామాల పునర్నిర్మాణం" అనే అంశంపై చర్చ సమావేశానికి ప్రారంభోత్సవం చేసూ కేంద్రప్రభుత్వ హోంశాఖ మంత్రి పండిత గోవిందవల్లభపంత్ అన్నారు.

ఈ చర్చా సమావేశం నేటినుంచి అయిదు రోజులు జరుగుతుంది. సుమారు వెయ్యి మంది ప్రతినిధులు వచ్చారు.

వ్యవసాయదారులు దినకృత్యంలో ఎదుర్కొనే సమస్యలను పరిశీలనకు తెచ్చి వాటికి పరిష్కార మార్గాలు చూపించడమే యీ సమావేశం లక్ష్యమని పండిత గోవిందవల్లభ్ పంత్ సు స్వాగతం చెబుతూ కేంద్ర ప్రభుత్వ వ్యవసాయశాఖ మంత్రి డాక్టర్ పంజాబ్ రావ్ దేశ్‌ముఖ్ వివరించారు. ఆయన ఇంకా ఇట్లా చెప్పారు: "ప్రజల్లో పరిపాలనా నిర్వహణ ఉద్యోగులను మధ్య సహకారం పెంపొందించి సామ్యవాద సమాజ సూత్రాలను దృష్టిలో పెట్టుకొని గ్రామాలలోని ప్రజల స్థితిగతులు బాగుపడడానికి వీలుగా వారికి స్వయం సహాయ శక్తి అలవరచడమే సమాజాభ్యున్నతి కార్యక్రమాల లక్ష్యం.

చర్చా సమావేశాన్ని ప్రారంభిస్తూ గ్రామాల పునర్నిర్మాణం అంటే శుభ్రమైన ఇళ్ళు, మంచి పాఠశాలలు, ఉద్యానవనాలు, పిల్లలకు ఆటస్థలాలు మొదలైన సౌకర్యాలన్నింటితో సుసంపన్నమైన గ్రామాలను నిర్మించడమన్న మాట అని పండితపంత్ వివరించారు. ఇంకా ఇట్లా చెప్పారు: "సుసంపన్నమైన చక్కటి గ్రామాల బయటి ప్రపంచంతో సంబంధ మేర్పరిచే రవాణా సౌకర్యాలుండాలి. గ్రామస్థులు ఆత్మగౌరవాన్ని, నిస్పృహను విడనాడి తమ సామర్థ్యాన్ని తాము గుర్తించి తేటపు భారతదశానికి మాతృం లేదని మహాత్ముడు సూత్రించాడు. అంటే విశుద్ధ నైతిక రక్తమలై సహేతుక సుఖశాంతులతో జీవించే అవకాశం గ్రామస్థులందరికీ లభింపచేయాలన్న వినూత్నాభిప్రాయం గ్రామాల పునర్నిర్మాణ కార్యక్రమం గా రూపొందింది."

"శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక విజ్ఞానాల సత్ప్రయోజనాలు, తరతరాల సంప్రదాయాలను సమన్వయం చేయడానికి వీలుగా నైతిక సాంఘికాంశాలను సమన్వయం చేయాల్సిని ఈనాడు మనం ఆశించుచున్న సముద్ధరణ కార్యక్రమం లక్ష్యం. అయితే గ్రామ జీవితంలో అత్యంత ప్రధానమైనది వ్యవసాయం, దానికి సంబంధించిన వృత్తుల అభివృద్ధి అన్నమాట నిజమే."

అటుతరువాత మొదటి పంచవర్ష ప్రణాళికలో జరిగిన అభివృద్ధి పనులను వివరించి దేశంలో వ్యవసాయోత్పత్తులను నూటికి 15 వంతులు ఎక్కువ చేసి, మొత్తం మీద ఉత్పత్తిని 114 నుంచి 135 అంశాలకు ఎక్కువ చేయడం రెండవ పంచవర్ష ప్రణాళిక ఉద్దేశమని పండితపంత్ చెప్పారు. ఇప్పటికంటే మంచి సాధనలు, మంచి విత్తులు, ఎరువులు మొదలైనవి వినియోగించి, నీటి పారుదల సౌకర్యాలను ఎక్కువచేసి, క్రయ విక్రయ సౌకర్యాలను పెంపొందించి పంటలను ఎక్కువచేయడమే ప్రధాన సమస్య అన్నారు. తమకు తెలిసిన విషయాలను రైతులకు తెలియజెప్పి, వారి సమస్యలను సానుభూతితో అర్థం చేసుకోవలసిందిగా వ్యవసాయశాస్త్ర నిపుణులకు శాస్త్రవేత్తలకు పండితపంత్ విజ్ఞప్తి చేశారు. రోజు రోజుకూ పెరిగిపోతున్న జనాభా అవసరాలకు సరిపడే వస్తువులు దేశంలో తయారు కావడానికి వీలుగా సహజ సంపదను వినియోగంలోకి తీసుకురావాలి. పశువుల పేడను సక్రమంగా వినియోగించు కొని మిశ్రమ సాగుపద్ధతిని అమలులోకి తీసుకురావాలి. ఆ పశువులను అభివృద్ధి చేసే వాటు ఎరువు తయారుచేసేందుకు రైతులకు అవసరమైన వాటిని సప్లయి చేయవచ్చునని పండిత పంత్ సూచించారు.

తోటలను అభివృద్ధిచేసి, పశుసంపదనభివృద్ధి చేసుకోవలసిన అవసరం చెప్పి గ్రామాలలో దాదాపు పనులన్నీ సహకార సంఘాలద్వారా చేసుకొనడానికి ప్రయత్నించాలన్నారు. కుటీర పరిశ్రమలు నిరుద్యోగ సమస్య పరిష్కారానికి బిని యోగపడతాయి అంబర్ చర్ఖా ప్రాముఖ్యాన్ని శ్రీ పంత్ విపులీకరించారు.

గ్రామాల పునర్నిర్మాణానికి గ్రామాల్లోని ప్రజలలో వినూత్న జీవితం ప్రకాశింప జేయడానికి చక్కటి పద్ధతులలో ఏర్పాటైన గ్రామ పంచాయతీలు అవిరళ కృషి జరగాలి. ఇందుకు గ్రామ పంచాయతీల ద్వారా అధికార వికేంద్రీకరణ అవసరం. రక్షణ, పారిశుద్ధ్యం, ఆరోగ్యం సౌకర్యాలవంటి వ్యవహారాలన్నీ తామే నిర్వహించుకోగల సమర్థ సంస్థలుగా, ప్రతివ్యక్తి గ్రామాభ్యున్నతికి కృషిచేసే అవకాశం లభించడానికి వీలుగా రాజకీయాలకు అతీతంగా గ్రామ పంచాయతీలు పని చేయాలని పంత్ సలహా చెప్పారు. ఉత్తర ప్రదేశ్ వంటి కొన్ని రాష్ట్రాలలోని గ్రామాలలో యీ రకం గ్రామస్వరాజ్యం అమలులో ఉన్నది. ప్రారంభంలో కొన్ని చిక్కులు వచ్చినా నిజమైన ప్రజాస్వామ్యం ఆ విధంగానే నెలకొనగలదని చెప్పి మహిళలు కూడా గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాలలో కృషి చేయాలన్నారు.

"మన ఆశయాలు వీలైనంత త్వరగా నెరవేరడానికి అవిరళకృషి చేద్దాం" అని శ్రీ పంత్ ఉద్బోధించారు.

అటుతరువాత రైతుల సమస్యలను చర్చించేందుకు ప్రతినిధులందరు జట్లు జట్లుగా విడిపోయినారు.

# ఐస్లండులో అమెరికన్ సేనలు

## ఉపసంహరించాలని అభ్యర్థన

న్యూయార్క్, ఏప్రిల్ 1: ఆయుధాల తగ్గింపు సమస్యపై రష్యా వైఖరిలో వచ్చిన ఆకస్మిక మార్పులకు అమెరికా విదేశాంగశాఖ కలవర పడుతున్నది. వ్యక్తి ప్రాధాన్యతా సూత్రానికి స్వస్తిచెప్పటం పేరుతో స్టాలిన్ మీద దాడులు జరిగిన విషయమై అమెరికా విదేశాంగ కార్యాలయం ఇంకా మథనలు, కుంజాటనలు పడుతునే ఉన్నది. ఇంతలోనే, పులిమీద పుట్ర అన్నట్లు ఇదొకటి వచ్చిపడ్డది.

ఆయుధాల తగ్గింపు సమస్యపై రష్యా వైఖరిలో వచ్చిన మార్పులు ప్రస్తుతం జరుగుతున్న అంతర్జాతీయ మానసిక సంఘర్షణలో అమెరికాకు చిక్కులు కలిగిస్తున్నట్లు భావించబడుతున్నది. రష్యా మార్పులవల్ల పశ్చిమరాజ్యాలు ఆత్మరక్షణపట్ల ప్రమత్తులయే ప్రమాదం ఎక్కువవుతున్నదని రాజకీయవర్గాలు, భావిస్తున్నారు.

ఐస్లండులోనుంచి అమెరికన్ బలాలను ఉపసంహరించాలని ఐస్లండ్ పార్లమెంటు కిందటి వారం చేసిన తీర్మానం ఈ వైఖరికి ఉదాహరణగా వీరు పేర్కొంటున్నారు. ఐస్లండ్ పార్లమెంటు అట్లుకోరటానికి కారణం జెనీవా అగ్ర నాయక సమావేశానంతరం అంతర్జాతీయ వైమనస్యాలు తగ్గటం అని పేర్కొనటం జరిగింది.

ఏది ఎట్లా ఉన్నా, మొత్తానికి సోవియట్ విధానంలో మార్పులు అంతరంగికంగానూ, బాహ్యంగానూ ఒత్తిడిని తగ్గించేదిగా ఉన్నవని అంగీకరించక తప్పదని ఇక్కడి రాజకీయవర్గాలు భావిస్తున్నారు.

బ్రిటన్ సోవియట్ నాయకులతో సంప్రదించేదాకా అమెరికా వైఖరి ఇదమిత్థమని తేలదు. అంతవరకూ అమెరికా ఇటు శాంతిసన్నాహాలు పేరకుప్ప చేస్తూ, మరొకపక్క ఆయుధాల సప్లయి సాగిస్తూ ఉంటుందని తెలుస్తున్నది.

# కామన్‌వెల్తు దేశాల చర్చలు

జూన్ చివరలో కామన్‌వెల్తు ప్రధానుల లండన్‌లో సమావేశమయినప్పుడు రక్షణ సమస్యలపై ముఖ్యచర్చలు జరుగుతవని తెలుస్తున్నది. ఈ రక్షణ చర్చల్లో భారతదేశం పాల్గొనదు.

కాకినాడ శ్రీ విద్యార్థినీ సమాజంనుంచి హిందీ పరీక్షలకు వెళ్ళిన విద్యార్థినులు కూర్చున్నవారు ఉపాధ్యాయినులు—మధ్య నిర్వాహకురాలు శ్రీమతి వేమగంటి పాపాయమ్మ.

# రష్యా యుద్ధ విమానాల కొనుగోలు

## భారతప్రభుత్వం వాకబ్ చేసిందని శ్రీ నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 2: "సోవియట్ యూనియన్ దగ్గర ఆయుధాలనూ, యుద్ధవిమానాలనూ, పౌర విమానాలనూ, ఇంకా అనేక సరుకులనూ కొనే విషయమై భారత ప్రభుత్వం వాకబు చేసింది. ఈ సరుకుల్లో కొన్ని రష్యానుంచి ఇటీవల అంతకంతకూ ఎక్కువగా మనకు సప్లయి అవుతున్నవి" అని శ్రీ నెహ్రూ విలేఖరుల గోష్ఠిలో వెల్లడించారు.

ఈ విషయమై ఆయన ఇంకా ఈ క్రింది వివరాలు తెలియజేశారు: "ఆయుధాల కొనుగోలుకోసం కొన్ని ఇతర ప్రభుత్వాలలో కూడా, ముఖ్యంగా బ్రిటన్‌తో, సంప్రదిస్తున్నాము. టాంకులు, విమానాలు మొదలైనవాటి సప్లయి కోసం బ్రిటన్‌తో రెండు ఏళ్ల నుంచీ సంప్రదింపులు జరుపుతున్నాము. ఈ సంప్రదింపులకు చాలా కాలం పడుతుంది. సరుకులు పంపుకున్నట్లు మాట ఇచ్చి చాలా కాలమయింది. వాటిని అందజేసే విషయంలో ఇటీవల కొన్ని ఏర్పాట్లు జరిగినవి.

### పలానావారి దగ్గరే కొనాలన్న నిర్బంధం లేదు

భారత దేశానికి సంబంధించినంతవరకూ, పలానా దేశం దగ్గరే ఆయుధాలు కొనాలన్న నిర్బంధం లేదు. ఎవరి దగ్గర, ఎప్పుడు ఏమిటికొనాలి అనే విషయాలను భారతదేశం తనకైతాను తన శక్తి సామర్థ్యాలనూ, అవసరాలను బట్టి నిర్ణయించుకుంటుంది.

భారత సైన్యాలు బ్రిటిషు సైన్యాల పద్ధతిలో పెంపొందించబడుతున్నవి. కనుక, బ్రిటను దగ్గరే, ఆ సైన్యాలు వాడే రకాల ఆయుధాలనే కొనటం లాభకరం. అయితే ఆపద్ధతిని మార్చటం ఎప్పుడు అనే సంగతి మన అవసరాల మీదనే పూర్తిగా ఆధారపడి వుంటుంది. ఈమార్పును అందరికీ చెప్పిచేస్తాం అనే నియమం ఉండదు.

లార్డుమౌంట్ బాటన్‌వారితో సంప్రదించింది విమాన నావిక శాఖను కనుగొనే విషయం మీదనే ఈ విషయమై రెండు సంవత్సరాల నుంచీ సంప్రదింపులు సాగుతున్నవి.

### బాంబర్ల కొనుగోలు

బాంబరు విమానాలను కొనటంవల్ల భారతదేశ రక్షణ వ్యూహపు స్వరూపమే మారిపోదా అని ఒక విలేఖరి ప్రశ్నించగా, మారిపోదని ప్రధాని జవాబిచ్చారు.

"ప్రతి విమానదళంలోనూ బాంబర్లు, ఫైటర్లు ఉంటవి. మన విమానదళం ఏర్పడినప్పటినుంచీ మనకు బాంబర్ విమానాలు ఉన్నవి. అయితే ఒక్క తేడా ఉన్నది. మన బాంబర్ విమానాలు దగ్గరి ప్రాంతాలమీద బాంబులు వేసేవే దూరప్రాంతాల మీద దాడి చేసేవి కావు. అంటే గస్తీ చర్యలకు మాత్రమే ఉపయోగిస్తవి. అని" ఆయన వివరించారు.

ఆయుధాల కొనుగోలువల్ల ద్వితీయ ప్రణాళికకు ఏమయినా దెబ్బ తగులుతుందా అని ప్రశ్నించగా, అది అప్పటి పరిస్థితులమీద ఆధారపడి ఉంటుందని ప్రధాని తెలియజేశారు. ఏది ఎట్లా ఉన్నా, మనం ప్రణాళికను పూర్తిగా అమలు జరిపేందుకు నిశ్చయించుకుని, అదనపు భారాన్ని భరించవచ్చునని ఆయన అన్నారు.

బ్రిటన్ ఆయుధాలు సప్లయి చేయటంలో ఎందుకు ఆలస్యం జరిగింది అని ప్రశ్నించగా, అనేక ఆర్డర్లు వచ్చి వుంటవనీ, వాటిలో ప్రాధాన్యతా క్రమం నిర్ణయించటం జరుగుతుందనీ ప్రధాని జవాబిచ్చారు.

# కావలెను

ఉండి (ప. గోదావరి జిల్లా) లో ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక, భారతులను వారి స్వంత బాధ్యతపై విక్రయించుకొనుటకు న్యూస్ ఏజెంటు కావలెను.

మేనేజరు,
ఆంధ్రపత్రిక, మద్రాసు-1.



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd, by S. Radha Krishna, at The Andhra Patrika Press, No. 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.